# రాధామాధవ సంవాదము

కర్త:

వెలిదిండ్ల వేంకటపతి.



యస్. అప్పలస్వామి అండ్ సన్సు

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,

రాజమంద్రి.

1949

వెల 1-0-0

శ్రీరస్తు

# రాధామాధవసంవాదము

## ప్రథమాశ్వాసము



క. శ్రీ రుక్మిణీమనోహర, కారుణ్యసుధాసముద్ర కంసమథనయ
సూరిరాంబరీషసుజనా, సూరిరచిదానంద కృష్ణగోపముకుందా. 1

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన రాధామాధవ సంవాదం బను
మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 2

చ. అనవరత ప్రబోధకరమౌ మిథిలాపురమందు నొక్కనాఁ
డనఘుఁడు ధన్యుఁడౌ జనకుఁ డార్యులతో సుఖలీల నుండి సొం
పున సకలావతారములపుణ్యకథ ల్వివరింప వించు నా
చనవున వేఁడెఁ గృష్ణకథ సత్యనిధిన్ శుకయోగిరాయనిన్. 3

చ. అడిగిన భక్తితోడఁ బులకాంకితుఁడై నయనాంబుజంబులన్
వెడల ముదంబుధార యదువీరుని గృష్ణుని సన్నుతింపఁగాఁ
బడసితి నెంతభాగ్య మని పద్మదళాక్షుఁ దలంచి మ్రొక్కుచున్
బడలిక దీఱఁ బాపములు వాఱఁగ భాగ్యము చేర నిట్లనెన్. 4

గీ. జనకరాజేంద్ర వినవయ్య సావధాన, మతిని గృష్ణుని చరితముల్ మహిని విందు
మవి రుచింపవు మాకు మాయనుభవంబు, చెలగుశృంగారరూప మాఁ జిత్తగింపు. 5

మ. యమునాతీరమునందు బృందవరి బాగా పల్లె వ్రేపల్లె నా
నమరున్ గొల్లలపల్లె తజ్జనులభాగ్యం బెంతవర్ణింతు మె
ల్లముగా నందఁడుఁ గొల్లలాడుదుఱు పాల స్నేతఁ దస్నేతయై
యమితానందుఁడుఁ నందుఁ డందు దగు దేవాధీశభోగంబులన్. 6

సీ. తీరుగాఁ గైసేయు తేరులచందానఁ, బొదుగులతోడి యాఁగదుపు లమరఁ
గనుఁగానక మదించుగజములకైవడిఁ, గొమ్ములవృషభమ్ము లొక్కమరుమిగులఁ
జివ్వన నటు కాలు ద్రవ్వువీరులరీతిఁ, జలపోరి పెనగుకోడెలు చెలంగఁ
జెంగున దాఁటుతురంగంబులవితానఁ, జారుకైనలేఁగలు సొంపుమిగుల

గీ. నదియె చతురంగబలములై యతిశయిల్ల, మొల్లమై యున్న వ్రేపల్లె నల్లుకొన్న
ఫలితవనములు కోటలై పరిఘవిల్లు, నందుఁ జెలువొందు నందుఁ డానంద మొంది. 7

క. ఒకపశువుఁ బ్రోచువానికి, సకలఫలంబులును గల్గు సంతతమును కో
టికి మించుపశుగణంబులఁ, బ్రకటంబుగఁ బ్రోచు నతనిఫల మే మందున్. 8

గీ. అతనిపుణ్యంబునన్ లేక యతనిపుణ్య, పత్నియగు యశోదాదేవి భాగ్యమునను
కృష్ణుఁ డుదయించె వారి కింకేమి తెలుప, జలజనయనునిభక్తవాత్సల్యమహిమ. 9

చ. చిగురులపాదము ల్కళలఁ జిక్కుడువ్రేళ్ళు నొయారిపిక్కలున్
జిగితొడ లందపుంబిఱుఁదుఁ జెన్నగుబొజ్జ వెడందఱొమ్ము బా
గగుకరము ల్మనుంగళము నద్దపుఁజెక్కులు నవ్వుమోము తే
టగుకనుదోయి ముద్దుగురియన్ బెరిఁగెన్ హరి యందు బాలుఁడై.

సీ. పట్టాభియోగసౌభాగ్యము ల్దిలకించి, నందుండు సంతతానంద మొందఁ
దొట్రుపల్కులు ముద్దుదొలఁకునవ్వులం గాంచి, మురిసి యశోద సమ్మోద మంద
నవమోహనాంగసౌందర్యంబు భావించి, పసిగాఁపుగుబ్బెతల్ పైఁబడంగఁ
బూఁటపూఁటకు వృద్ధిబొందురూపముఁ జూచి, జనులెల్ల నాశ్చర్యమునఁ జెలంగఁ

గీ. దలిరువలె గోముపై మొగ్గవలెను సోగ, యై యలరువలె మృదువునై కాయవలెను
బెక్కువై పండువలె నెఱచొక్కమగుచుఁ, దేనెవలెఁ దేటయై శౌరి తేజరిల్లె 11

ఉ. అప్పుడు లేఁతప్రాయమున నాఁడుచు నందునిముద్దుఁ జెల్లెలా
కప్పురగంధి రాధ యనుకన్నియ యొక్కయనామధేయుఁ జి
న్నప్పుడె పెండ్లియాడి మగఁడంచని చూడదు వాని వాఁడు నా
యొప్పులకుప్పఁ గన్గొనఁగ నోడును వ్రీడను గొల్లవెట్టిచేన్. 12

క. వెన్నెలను జలువ పుట్టిన, చెన్నునఁ బువ్వులను దావి చెలఁగినరీతిన్
గన్నియసకలాంగంబులఁ, దిన్నఁగ నొకవింత వొడమె దినదినమునకున్. 13

క. వనిత తనుఁదానె చూచుక, తనలోఁ దా నుస్సురను వితాకై తనకున్
దనసొగసుకుఁ దనముచ్చట, కనువైనప్రియుండు లేని యారాటమునన్.

క. తొల్లి తప మేమిచేసెనొ, కొల్లగఁ బసిపాలుఁడైన గోపాలునితో
మల్లాడుచు నెల్లప్పుడు, చెల్లాటల నుండు రాధ జిలిబిలితమిచేన్. 15

క. బాలుఁ డగుశౌరి నెత్తుక, హేలాగతి ముద్దులాడు నేపొద్దు వృథా
కాలక్షేపంబునకును, జాలక రాధాలతాంగి చాలవిరాళిన్.

ఉ. భావిఫలాభిలాషమున బాలుని కేమఱి కుగ్గు వెట్టుఁ బె
య్యావులపాలతో జలకమార్చును దాఁ దొడనుంచి యేమిచూ
చేవనినవ్వుచున్ బయఁటచేఁ దడియొత్తి సిరామరక్షతోఁ
గావుగఁ జుక్కబొట్టు నొసలన్ ఘటియించి కదించు నుయ్యెలన్. 17

ఉ. నావెలలేనిమానికము నాతొలినోముల మెట్టపంట నా
దేవుఁడ నామనోరథముఁ దీర్ప జనించినచక్కనయ్య నా
జీవనజీవనంబ యదుశేఖర యించుక నిద్ర పోఁగదే
యో వెడమాయకాఁడ ! యని యుయ్యెల నూఁచును రాధ మాధవున్.

గీ. ఏమఱించి కృష్ణుఁ డిండ్లలోఁ జొరఁబడి యున్న పాలు పెరుఁగు వెన్న నెయ్యి
కొల్లలాడుచుండ గోపిక లొకనాఁడు, దొమ్మిగూడి రాధతోడ ననిరి. 19

క. ఉట్లపయి నున్నవెన్నల, చట్లలను గొంచుఁబోయి సంగాతులతో
నాట్లాడఁదొడఁగె మాబ్రతు, కెట్లా కడవెళ్ళునమ్మ యిట్లాగయినన్. 20

క. ముద్దిమ్మని బలిమిని మా, ముద్దియచే నున్నవెన్నముద్దలు గొనె నీ
ముద్దులబాలుఁడు నీ కిది, ముద్దయినన్ గొమ్మమాకు ముద్దటవమ్మా. 21

క. బంతులటంచును జెలిచను, బంతులు బిగఁబట్టి లేదు బంతి యటంచున్
గంతులువైచెచను మముఁ గని, కాంతా యిటు తగునె యెంతకలవారలకున్. 22

క. మందకుఁ జని రాఁగను మా, మందగమన నాఁగి నీదుమగఁ డెవఁ డనుచున్
గందువమాటల నడిగె, న్నందమె మనజాతి కిట్టి యాగడము చెలీ. 23

క. నీవైన బుద్ధి తెలుపుము, నీవలనను గాకయుండె నేమె యశోదా
దేవికిఁ దెలిపెద మనఁగా, నావేళకుఁ బులిమిపుచ్చి యా రాధ వడిన్. 24

క. ముద్దిచ్చును గోపాలుఁడు, వద్దను వశయాడుచున్నవార్తలు విన్నన్
గద్దించును లేదన్నను, బద్దించును జూడకున్నఁ బరితాపించున్. 25

ఉ. ఓయి మనోహరాంగ పనియున్నది పోయెదుగాని యిట్లు రా
వోయి మహానుభావ యని యూరక పిల్చును బిల్వ నేమి రా
ధా యని యాతఁడున్ బలుకఁ దా విని నవ్వుచు వేగ నిందు రా
వోయి భుజింపఁగావలదటోయి యటంచు వచించు బ్రాళితోన్. 26

చ. పడుచులతోడ నాడ పసిబాలుఁడవా వలదన్న మాన వా
గడములు కొన్ని నేర్చితివి కల్లరి వైతివి కొల్లకాఁడ వై

దుడుకులు సేయసాఁగితివి దొంగిలఁజొచ్చితి వేమి తెల్పినన్
వడిగఁ బరాకుచేసికొని వాకిటి కేగెదు పిల్వఁబిల్వఁగన్. 27

ఉ. బుద్ధులు దెల్పఁబోవుగతిఁ బూనుక కన్నులు పుల్మకొంచు నే
ప్రొద్దున లేచి యిండ్లఁబడి పోయెద వమ్మక చెల్ల పిన్నవుం
బెద్దవుఁగావు బువ్వ దినిపించెదఁ జక్కనిసామి రార నా
ముద్దులకృష్ణ రార యని మ్రొక్కుచుఁ జీరును రాధ మాధవున్. 28

ఉ. అల్లుఁడ దొండపండు వలెనా యని వాతెర యాన నిచ్చు నీ
కొల్లవె పుట్టచెండు విదిగో యని చన్గవఁ బట్ట నిచ్చు రా
గిల్లి మయూరపింఛ మడిగేవని పెన్నెరు లంట నిచ్చుఁ బో
కల్లరి యంచుఁ గృష్ణుఁడు నగ న్నగి రాధ యదేమిరా యనున్. 29

సీ. తీరుగాఁ గస్తూరితిలకంబు దిద్దుచోఁ, గమకించి నెమ్మోముఁ గదియఁజేర్చు
హొయలుగా గంధంబు మెయినిండఁ బూయుచోఁ, బరికించియిష్టవల్ గరఁగినంటు
మెలపుగా సిగను బూవులదండ చుట్టుచోఁ, బులకించి కుచము వీఁపునఘటించు
హారువుగాఁ గైసేసి యద్దంబుఁ జూపుచోఁ, దిలకించి తనమోముఁ దెలియఁజూపుఁ
గీ. జెలఁగి మాటాడబోవుచోఁ జెక్కు గీటు, బిలిచివీడెం బొసఁగుచోఁ బెదవిఁగొఱుకు
గదిమి పైఁబడఁ దిగుచుచోఁ గౌఁగిలించు, దమిమనంబున నాఁటిరాధావధూటి. 30

క. కడిమాడనేయుభోజన, మిడుఁ బిడికిట నిముడు వలుచ లిచ్చును బెడఁగా
తొడవులు దొడుగును బడిబడి, గడెగడె కొకవింతసొగసు గావించుహరిన్. 31

సీ. ఎవతెతో సయ్యాట మింటిలోన నటంచు, భయపడ నదలించు బైటనుండి
చంటిపైఱైక సడల్చి జారుపైఁట ఘటించి, యేది బాగని వేఁడు నెదుటనిల్చి
వాకిట మగవారు రాకుండ నిలుమంచు, జలువకోక ధరించుఁ దలుపుమూల
దాఁగ నేరవు పల్కుదారి గాదని దూరు, వలదని మురిపాన వద్దఁ జేరు
నాఁడునాఁటికి గోపాలుఁ డీడుమీఱె, తొలుత నూనూఁగుమీసాలతోఁ జెలంగఁ
బదరి మునువలెఁ బైబక్కఁబడఁగ నళికి, బెళఁకు వగఁగుల్కు మురునికి బెదరి రాధ.

క. ఆరాధమనోజవ్యధ, నీరీతుల నిరుగుపొరుగు లెఱుఁగకయుండన్
గారాబుసేయఁ గృష్ణుఁడు, చేరక తా నది పరాకు చేయుచునుండెన్. 33

సీ. తొలుదొల్తఁ బసిగాపుఁగులుక గుబ్బెత యొంటి, పాలైనమోము తప్పకయె చూచుఁ
జూపువెంబడిఁ దన్నుఁ జూచి సిగ్గున నిల్వ, దలయూఁచి కోరికల్ దెలియ నవ్వు
నవ్వువెంబడిఁ బిన్ననాటిముచ్చట లెంచి, నను నయోదయజూడ వనుచుఁ బలుకుఁ
బలుకువెంబడి గేలఁబైఁటకొం గెడలించి, నునుజన్నులాన ఱొమ్మునకుఁ జేర్చు

గీ. జేర్చి మునిపంట జిగిమోవిఁ జీరనొక్క, నొక్కి సొక్కించి మురుకేళి గ్రుక్కఁజేయుఁ
జేసి కనుమాటి యింటికిఁ జేరనరుగు, నఁగి తనుగానిరీతి తనంతనుండు 34

క. ఆచిన్నెలు సవసవఁగా, జూచాయఁగ విని చలించి గ్రుక్కినరాధన్
జూచి యదేమే రాధా, నాచాయన్ సిగ్గువడెదు నాహరి కనియెన్. 35

సీ. చెంత నీవునులేక చింతతోఁ బవళించి, నిదురబోవుచునుండ నిన్నరేయి
కలలోన నొక్కచక్కనిరాచకొమరుండు, దోఁచె నెవ్వఁ డటంచుఁ దోఁచదాయె
నొకకొంతసేపు తప్పక చూడఁజూడంగ, నీపోలికైయున్న నీవటంచు
రారకృష్ణా యని బారతోఁ జేసాఁప, నేమె రాధ యని యెదురుకొనుచు

గీ. నెనసి యేమేమొ వింతగా నింపొనర్చె, నంత మేల్కాంచి నినుఁగాంచి యదితలంచి
మురిపెమున నిన్నుఁజూడక మోమువంచు, కొంటి నాసిగ్గు నేమనుకొందు నోయి.

మ. అనినన్ బక్కన నవ్వి చిక్కితివి రాధాసాధువే యంచు నుం
టిని నీనాథునిమీఁదిప్రేమ వినఁగంటిన్ దుంటవిల్దుంట వెం
టనె యంటన్ననవింటితూఁపు లెద నంటన్ దుంట లింకేల నీ
ధ్వని వాచారసభావభావభవగాధల్ నీవగ ద్దెల్పెడిన్. 37

క. విరిదాఁపఁ దావి దాఁగునె, పరిపరి పలుకేలనిజము పలికితి వౌ నా
ధర వినమె "సత్యవాణీ సరస్వతి" యటన్నమాట చదువులలోనన్. 38

క. అనిపల్కు శౌరిపలుకుల కును మెచ్చుచునిన్ని నాళ్ళకును నీవైనన్
మనసెఱిఁగి చిక్కఁబట్టితి, తనుఁ బో యని కృష్ణుతోడఁ దానిట్లనియెన్. 39

సీ. కండచక్కెరపానకంబు గావలెనందు, వది గోరవేమిరా యంబుజాక్ష
రంగుబంగరుబొంగరాలు గావలెనందు, వది గోరవేమిరా మదనజనక
యిసుకతిన్నెలమీఁద నెక్కఁగావలెనందు, వది గోరవేమిరా మదనరూప
తోడిబాలురతోడ నాడఁగావలెనందు, వది గోరవేమిరా యమునవంద్య

గీ. తియ్యనైయున్న యలమోవి తేనె వలతొ ?
జంటగొనియున్న యలచన్నులంటవలతొ ?
త్రొక్కికదసినపిఱుఁదుల నెక్కవలతొ ?
జోడువాయక స్త్రీలతో నాడవలతొ ?

ఆ. నీకువాడమెల్ల నిన్నరాతిరి గంటి, నమ్మ చెల్లన్నినునమ్మరాదు
నవ్వుగాదు రేయి నాప్రక్కలోనుండి, కలువరించలేదె చెలులనెల్ల.

ఉ. అందుల కాసయేని మగవాండ్రపయిం బడి మూరు వొందఁగా
నెందును గంటి కింపయినయింతుల నల్గుఁరఁ బెండ్లిసేయనో

పొందుగఁ బ్రొద్దుపోకలకుఁ బూనితివేనియు మేము నేరమో
యందఱవంటిముచ్చటలు నాటలు పాటలు నోటిమాటలున్. 42

క. చిన్నప్పుడె యెడఁబాయక, కన్నుల నిన్నెపుడుఁ జూడఁగలిగుండును నేఁ
డెన్నంగ నీముసముఖము, క్రొన్నెలపొడు పయ్యె గగనకుసుమం బయ్యెన్ 43

చ. అగమగలేక నీకొఱకు నల్లిబిల్లిగా వసింతు మి
ద్దఱ మప్పు డెవ్వరున్ మనలఁ దాఁకి తలంపరు నేఁడు వింటివో
మఱి వినలేవొ యీజనులమాటలు వాడల నాడ నాడ నీ
పరువులు చూచి నాపయిని పాపముఁ గట్టిరికేమి తెల్పుదున్. 44

క. మచ్చరమున నొక రనుకొన, నొచ్చెము నాయందుఁ గలదె యొకనాఁడైనన్
ముచ్చటగా నినుఁ గౌఁగిఁట, గ్రుచ్చితినో లేనిచౌరవము జొచ్చితినో 45

క. నే నిందుకొఱకె నవ్వస, హా నోడుదు పట్టినింద లందితి నయ్యో
యైన దిఁక నాయె నందుకె, పూనుద మందఱకుఁ గన్ను పొడిచినరీతిన్. 46

క. నామనసులోనికోరిక, నీమజనంబులె నిజంబు చేసిరి మన కీ
నీమం బెందుల కీవఱ, కేమాయెను గోదవ లోన లిటులాడుట చేన్. 47

సీ. చూడ నేర్చిననాఁడె సొలపుగా మును మున్నె, చేరంగ ననుఁ గటాక్షించినావు
నవ్వ నేర్చిననాఁడె ననువుగాఁ దొలుదొల్త, నాతోడ వగవుల్కు నవ్వినావు
పల్క నేర్చిననాఁడె భావంబుగా ముందు, నత్తత్త రమ్మని యాడినావు
నడవ నేర్చిననాఁడె నమ్మికగాఁ దొల్త, దొడరి చేపట్టి కాల్ ద్రొక్కినావు
కాఁడు సేయనియోజన నేఁడు గలదె మఱఁదు దైవంబు సాక్షులు మనమనములు
విను సదాచారనిరతులు విబుధులైన, ఘనులు తారాశశాంకులు గారె మనకు. 48

చ. అన విని రామ రామ యిటు లాడఁగఁ జెల్లునె నీకుఁ గాక నా
మన సరయందలంచితివొ మక్కువతోఁ గరుణించి నీవు పెం
చినతను వింత నీ వగడు సేసిన కాదను వార లెవ్వ రిం
దున కొడిగట్టినన్ వెనక దోసము గాదఁటె రాధికామణీ. 49

క. నీతోడఁ జర్చ సేయఁగ, బోతే నామనసు కొకటి పొడమినఁ బొడమున్
నీతోడఁ బలుకరా దిఁక, వాతప్పితి మొదలఁ బడుచువాఁడను నేనున్. 50

క. అని విఱుగ నాడి యంతనె, తవసంగడికాండ్రు పిలువ, దానాపలుకుల్
విని హో యని యెలుఁగిచ్చుచు, వనజాక్షుఁడు వెడలె మరల వచ్చెద ననుచున్.

చ. రమణియు నంతఁ జేదొరకరత్నము నాఁచుకపోయినట్టు లోఁ
గుములుచు నేరికిన్ దెలుపఁగూడక దొంగను దేలుగుట్టు చం
దమునఁ దపించుచు న్నళిననాభుఁడు మున్ విడనాడినట్టివా
క్యములనుసంగతుల్ తఱచుగాఁ దలఁబోయుచుఁ జింతసేయుచున్. 52

గీ. పొరుగులిరుగుల చెలులతోఁ బోయె ననుచు, గొండెములు దెల్పను యశోద కోపగింప
శౌరి రూపింపుమని తన్నుఁ గోర నెవరి, నడుగవచ్చెదు పడుచుల నడుగుమనును. 53

సీ. పనిలేనిపని జారుపైఁటతో నడయాడు, ముసిముసినగవుతో మోము వంచు
గడెగడెకొకవింతగా మేనుఁ గైసేఁయు, దోడిబోఁటుల వృథా దూరి పలుకుఁ
బలుమారు ముంజేతిచిలుకను ముద్దాడు, గని కానటులఁ గ్రేగంటఁ జూచు
నొంటిపాటైనచో నుస్సురు మని నిట్టూర్చు, దనుఁజూచునెడ గిరుక్కునఁ దొలంగు

గీ. నవల నివలను గుసగుసల్ సవసవలుంగ, వినియు వినములుగాఁ జేసికొనుచు మొదటి
నీటులకుఁ బోక పోవక నిలువలేక, మురియు నీలీల గోపాలు మ్రోల రాధ. 54

క. డాయు ననుఁ జెంతఁ బిలిచితి, వాయను నిన్నెనఁ బిల్వ నంచన నట్టే
పోయి నునుబువ్వు లివి వలె, నే యనునవి వలదటన్న నిఁక నెట్టు లనున్. 55

ఉ. ఘల్లున మ్రోయ నందియలుం గజ్జెలుం మువ్వలుం సందడింపఁగా
వల్లనిమ్మేనుడా లమర నవ్వుచు నల్లన నీవు రాఁగ రా
గిల్లుచు రబాతో డగియ గిల్లెద వేమిర మెల్ల మెల్లనే
యల్లుఁడె యర్థ మియ్యమని యందురు గావున నెవ్వఁ డేమనున్. 56

క. రారా నందకుమారక, రారా నవనీతచోర రారా కృష్ణా
రారా రాజులయేలిక, రారా ముద్దులమురారి రారా శౌరీ.

శా. రారా నందకుమార రార యదువీరా రార రాకాసుధా
ధారాకార మనోహరాంగ దయలేదా యైన నాయింటికిన్
రారాదా నినువంటివాని కిది మేరా నిన్ను నేమంటిరా
యేరా నీదగుజంటిలేనె తెరమో వీరా మనోవల్లభా. 58

చ. ప్రకటమనోజ్ఞరూప పసిబాలుఁడ వంచును నమ్మి ప్రక్క నుం
చుక నిదురించఁగాఁ బుణుకుచున్ గుచముల్ బిగఁబట్టి మేను మే
నికిఁ గదియించి పల్పెదవి నిల్పితి వేసిర మేనమామపో
లికలకుఁ జొచ్చినాఁడవో ? భళీ యనుచున్ దలయూఁచి నవ్వుచున్.

గీ. ఒంటి నెదురైన రాధ యోరోరి కృష్ణ, దాళు తాళు మటంచనఁ బాళు శౌరి
పదుగు రున్నప్పుడొకమాట పైఘటించి, తాళు తాళు మటంచనుఁ దనకుఁదానె.

చ. విడు విడు నీకొసంగ నని వేఱొక బాలున కొక్కతియ్యమా
మిడిఫల మీయఁబోవ బలిమిం గొని తా మొనపంట నొక్కి గ్రు
క్కెఁడురస మాని సీత్కృతు లొగిం జెలఁగం దలయూఁచి చూచెఁ గే
రడమున రాధికామధుర రాగసుధాధరవీటి సారెకున్. 61

క. ఆముద్దు చూచి రాధిక, యేమఱితి నదేమి చూచి తీవన నగి నే
నేను నినుఁ జూచినట్టులు, నీమనసునఁ దోఁచెఁ దెలుపు నీవని వేఁడన్. 62

చ. తెలిపెద నమ్మటంచు సుదతీమణి దుప్పటికొంగుఁ బట్టి లో
పలిపడకింటికిన్ దిగువఁ బద్మదళాక్షుఁడు మోడిమానిసిం
బలెఁ జని తెల్పుమంచనిన మంచిది పానుపుఁ జూడుమన్న ని
శ్చలుఁడయి కొంతసేపునకు జవ్వనిఁ దప్పక చూచి యిట్లనున్. 63

ఉ. మొన్ననె తెల్పలేదఁటవె మొన్నటి నిన్నటి పిన్నవాఁడ నాఁ
కొన్నను నీవు భోజనము కోరి యిడన్ వలె నెత్తిపెంచినా
వెన్నఁడు లేనిమాట లిటులేటికి నాడెదు మాటిమాటికిన్
గన్నులఁజూడు మల్లుఁడను గానఁటవే యన రాధ యిట్లనున్. 64

సీ. పసిబాలుఁ డందునా పరికింప నూరిలో, నీవు జూడనియట్టి నెలవు లేదు
వగఁ గానవందునా మగఁడు నీవే యని, నీరాకఁ గోరని నెలఁత లేదు
విననేర వందునా విద్యలయొరగల్లు, నీ వెఱుంగనిపాటి నీతిలేదు
దయఁజూడ వందునా ప్రియముతో నయముతో, నీవు లాలింపని నెలఁత లేదు

గీ. అన్నిటను జాణవే యాదు వైన నాదు, కూర్మి నెఱుఁగనిదొక్కటే కొదవ నీకు
నీకు నీయంతఁ దోఁచని నెనరు కలిమి, వచనరచనలఁ దెల్ప నెవ్వారితరంబు. 65

ఉ. పెంచినదాన నంచుఁ దలఁపించెదు సారెకు సారె నీదు ప్రా
పెంచినదాన నౌదు నిది యెన్న రహస్యము మావిపిల్కలన్
వంచనలేక పాదినిడి వారక పోషణచేసి పెంపు గా
వించుట తత్ఫలం బనుభవింపనొ యన్యులపాలు సేయనో. 66

మ. వినరా జావుల కేమి కాముకుల ముక్ విన్నాము కన్నాము తే
నినుఁబోలంగలవానిఁ గాన మవుశే నీ సేర్పు లోకంబులె

ల్లను గల్పించినధాత భారతికి యేలా ఱోలుఁడై వావి గై
కొనఁడాయె న్నిటువంటిసామెతలు నీకు న్నాతుఁ గానున్న వే. 67

ఉ. లేదని కుందినన్ ఫలము లేదని దైవము దూర నేల ? నీ
కే దయరాపలెన్ వెనుక నీవె తలంచుక చేరఁదీవలెన్
కాదని పైకొనన్ వరుస గాదని నిన్నెద నమ్మియుంటి నీ
వే దయలేక నన్నుఁ గడ కింతముఁ దెచ్చుటఁ నేఁ డెఱింగితిన్. 68

శా. ఓహో యత్తను నంపెనేని నతఁ డాయుష్మంతుఁ డౌనంట నా
యూహాలోకము సామెతాయె నన వేదోక్తంబు గాదందువే
నాహా మంచిది భూమిసామికిని నాలై యుండి యత్తోట సం
దేహంబా యిది వేదమందె వినవా నీమాట నీకే తగున్. 69

ఉ. ఎన్నఁడు పెద్దవాఁ డవుదు వెన్నఁడు జాణతనంబు నేర్తు వీ
వెన్నఁడు నామనంబు ఫలియింపగఁజేయుదు వంచు గోరి నే
నున్నది వల్లవీజనుల యుల్లముఁ జల్లగఁజేసి మెచ్చుకోం
చు న్ననవింటివానిపని చూఱలు వెట్టుటకా మనోహరా.

ఉ. భూషణభూషితాంగ పరిఫుల్లసరోరుహనేత్ర నీకు సం
తోషము వచ్చినప్పుడె నను న్దయజూతువు గాక యూరకే
దోషములంచు నన్నెతలఁ ద్రోయకు నేనిఁక మాన నీవపు
ర్వేషవిలాసమేఘము ధరించెద మత్కుచపర్వతంబులన్. 71

క. విను కాకుండిన వేళ్లోక, తనువున నినుఁ జెట్టఁబట్టఁదలఁచెద నపుడున్
వినవేమొ వావివరుసలు, తనువులకర్మంబొ జీవధర్మమొ చెప్పుమా. 72

వ. అనిన నబ్బాలికామణికి గోపాలమాడామణి యిట్లనియె.

ఉ. క్రమ్మరి యెన్నిపల్కెదవు కానివిపోనివి గుంపుసేసి వే
దమ్ములు నీతులుం దగవు ధర్మము శాస్త్రములున్ స్మృతుల్ పురా
ణమ్ములు నీకుఁ జక్కనయిన న్ననువారికిఁ జక్కనౌనె ని
పమ్మతు లూరివారలకుఁ జాటవలెంగద నేఁడు ముందుగన్

ఉ. మంచితనాన వల్దనినమాటలు నీకెగబోఁతలయ్యె నా
నంచు భవత్ప్రియంబునకు నై వినినం గొఱగా దిదేల నీ
కించుకవల్ల నేమి యొకయించుక వావి దలంచుకొమ్ము మ
న్నించుము నన్ను ముచ్చటయు నేస్తముఁ జాలదె రాధకామణీ. 75

ఉ. వెంటనె పాప వేల యవివేకము గట్టెదు వావి గాదు వ
న్నంటకు మన్న అంతులిడి యల్లునిమంచితనంబు లేదు పొ
మ్మంటివి యత్తసేయుపని కాఱడి లేదనుటే నిజంబు నీ
వంటియభిజ్ఞురాలి కిటువంటివి మంచి వౌనొ తలంపఁగన్. 76

గీ. అవనిఁ గాంతలు స్వేచ్ఛావిహార లగుట, తెలిసియే కాదె బ్రహ్మ విధించినాడు
మగువకొక్కఁడె మగవాఁడు మగఁడుగాఁగ, రాధ యిది ధర్మశాస్త్రవిరోధము గద.

వ. అనిన గోపాలగ్రామణికి రాధికావధూమణి యిట్లనియె.

క. మహిఁ దేహ సుఖ మెఱుంగక, తహతహపడి పరసుఖంబుఁ దాఁ గన కిహమున్
సహి పరము న్నహి యైతే, సహజతు యామగనిఁ గొల్వఁ జలమో ఫలమో. 78

మ. గతి వీఁడంచును బిన్ననాఁడు తమవేడ్కన్ బెద్దలొప్పింతు రె
వ్వతె కెవ్వాఁడు మగండొ కానరు మనోవాక్కాయకర్మంబులం
బతి యెవ్వాఁడని తోఁచె వాఁడె పతిగా భావించు నాతే పతి
వ్రత నా సమ్మత మీమతంబు చెడుత్రోవన్ బోవ నే వెఱ్ఱినే. 79

క. ఒక్కటి గల దైన మనో, వాక్కాయములందుఁ జెడ్డవారలత్రోవల్
ద్రొక్కక మక్కువ నొక్కఁడె, దిక్కని దక్కినదియే పతివ్రత తలఁపన్. 80

క. మగఁడు మగండని మగువలు, తగవులు నడపినను గాక తమ రొల్లనిచో
నగుఁ గాదని దండించునె, తగవున ధర్మాసనమునఁ దగి మగఁడో హో. 81

క. నిను నాఁ గాదన నేమో, యన వెఱతును గాని మిగిలినందుల కైతే
ననువారు వీరు నాఁగా, దనఁగాఁ బనియేమి యొకరికై బ్రతికెద నే. 82

చ. బుడుతవు నీ వసడ్డతనముల్ బచరించెదు బుజ్జగించి నే
నడిగినఁ బాపమంచనెద వంతకు నీకుఁ బనేమి నీకుఁగా
బడిబడి బాలనాఁడు మఱి పాలను నుగ్గిడునాఁడు నుగ్గునున్
నడపుచు నేనె పెంతునట నాకు స్వతంత్రత లేకపోయెనే. 83

చ. పలుకుల కేమి యేవగను బల్కఁగఁజాలవు నిన్ను మించి యు
క్తులు పచరింప నాతరమె, తొల్లిటివారలయాడికోలు మా
టలెఱుకద పల్కఁబోయిన నొడంబడికల్ పనిగావు నాపయిన్
చలమొ ఫలంబొ యేల కరసానలబెట్టెదు మౌక్తికంబులన్. 84

ఉ. పాపము పుణ్య మేర్పరుపఁ బాల్పడినాఁడవె నీవు నీకు నీ
పాపము లేల నీకొఱకుఁ బైబడి దీనత నొందజేసె నా

పాపము నిన్నుఁ గూడఁగలభావుల కబ్బెను బుణ్య మిందుపైఁ
బాపము పుణ్యముం గలదె భావమునన్ బరికించి చూడఁగన్. 85

శా. పో నామాటలు పూర్వపక్షములుగాఁ బోనాడి పోనాడి యా
నా నీమాటలె నిల్పుకొంటి నవి సిద్ధాంతంబుగాఁ జేసి నీ
తో నింకేటివితండముల్ పలుక నేర్తు న్నేఁటితో నిగ్రహ
స్థానం బైతిని నీవి దెల్పుపలుకే శాస్త్రంబు తర్కింపఁగన్. 86

క. శృంగారకవితవంటిది, యంగన కడుఁ బ్రేమచేత నానందముతో
నంగీకరించినం దగు, భంగంబున కోర్వఁగలదె భావజ్ఞనిధీ. 87

చ. లలితుఁడ వౌదు వంచు మొదలన్ జదివించిన దెల్ల నేఁటికిన్
గలిగెను గాళ్ళపైఁ బడినకామినిఁ గాదని వాద వాదలన్
గలుగు నాంధ్రకాళ్ళఁ బడఁగాఁ జదు వున్నదె మాటలేల నన్
సొలపునఁ గూడరా మనసు తీఱఁగఁ జల్లనిమాటలాడరా. 88

క. అల్లుఁడ వైనందులకున్, జెల్లుగ నుపకార మొకటి సేయుము నామే
నెల్లఁ గడుఁ గ్రాఁగుచున్నది, చల్లనినీమేన నొత్తి చల్లార్పు మిఁకన్. 89

గీ. నన్నుఁ దాఁకినపుడె నామేనికాఁకలు, నిన్ను సోఁకు ననుచు నెన్న వలదు
నిన్ను సోఁకఁబోదు నిను మున్ను గూడిన, మందసతులతనువులందుఁ గాక.

చ. ఇపుడు మదీయవాక్యముల కేకొనవో యని డెందమూరకే
తెపతెపఁ గొట్టుకాడెడిఁ బదింబదిగా నిదె చూడు మంచు న
చ్చపలమృగాక్షి లేచి యలసారసలోచను కేలుఁ దమ్మి నం
దపుటురమందు మోపుకొని తల్పు బరాలన మూసి కృష్ణునిన్. 91

ఉ. గొబ్బున శయ్యకున్ దిగిచి గుత్తపుటుబ్బురపుబ్బు సిబ్బెపుం
గుబ్బ లురంబునం దలమి గ్రమ్ముచు మెచ్చుచు మోవితేనియల్
జొబ్బునఁ జూఱఁగాఁగొనుచు సొక్కుచు ముద్దులఁ గొల్లలాడె త
బ్బిబ్బయి కొంతసేపు చెలి ప్రేమ నదేమనుచున్ వచింపకన్. 92

గీ. అత్త మల్లాడునప్పు డయ్యంబుజాక్షుఁ, డూరకుండుట సరిపోలకుంట గాదు
పరవశతచేత నేమియు బదులు సేయ, మనసులోఁ దోచకుండిన యునికి గాని. 93

సీ. మొదలఁ బుక్కిటివిడె మొసఁగి యెంగిలి గాదె, మంచిదిమ్మనుచు నిప్పించుకొనును
తానె గుబ్బ లురంబు నాని వోసము ద్రొబ్బ, మంచని కేలఁ బట్టించుకొనును
పలుమోపితెప్పారె బదులైనఁ బరిహార, మంచ కెమ్మోవి నొక్కించుకొనును
పరవశయై ప్రొక్కుమఱచితి నేఁ బెద్ద, నంచని మరల ప్రొక్కించుకొనును

గీ. ఒకటి చెలిగోర శౌరి దా నొకటిగోర, గొమరుబ్రాయంపుధనమెల్లఁ గొల్లలాడి
రిద్దఱును దోడుదొంగలై యింక మరుని, కేళిలంచంబు లిత్తురో యెఱుఁగరాదు.

సీ. కనుబొమల్ ముడివెట్టుకొని నీవు నే నంచు, వరుసవెంబడుల కైవాదులాడి
యాయతంబై నిల్చి యటు కేల నొడ్డుక, విరులబంతులతోడ వ్రేటులాడి
యాయముల్ దాఁకి హా యనినొచ్చి రోషాన, మురళించిగోళ్ళచే నఱకులాడి
కెరలి చేపట్లైనఁ గ్రిందు మీఁ దయి పోర, బిగువుతో సందీక పెనఁగి కూడి
బడలి సొక్కుచు సోలుచుఁ బాన్పుమీద, బడుచు లేచుచు మరలఁ బైఁబడుచునుండి
రిద్దఱును గొంతసేపు పెన్నద్దులగుచు, జిగురువిలుకానిబిగుదు మాట్పిలసంగ. 95

వ. ఇట్లు పెనంగుచు ననంగసంగరారంభమున కిద్దఱుం జొరక యాగరుధూపధూమంబుల
గుబులుకొను కమ్మకస్తూరితావులం బొనుగువడి కొంతవడిఁ జిత్రరూపంబులకైవడి
గదలకుండి రంత నగ్గోపికాకాంతునిం గవయుతమకంబున నక్కంబుకంఠి యిట్టట్టు
గొట్టుకాఁడుచు నతఁడు గదిసినఁ గదియనీక యవాంతరలజ్జాభరంబున దాఁపురం
బులం బెట్టుచు నట్టిట్టు గుట్టునం జిట్టాడి బట్టినం దట్టివైచి యొయ్యనొయ్యనం
బయ్యెదకొంగుఁ దిగిచి యుబికినచనుమిట్టల కట్టకేలకుఁ గేలుసాచినం బట్టీక చిట్టా
డుచు పట్టువిడుపుల చిట్టకంబులను వేగిరింపక యేమఱించి లాలించి కౌఁగిలించినం
గృష్ణుండు గదిమి యదుముచు, నుదుటుసిబ్బెంపుటుబ్బు గబ్బిగుబ్బ లురమ్మునం
గ్రుమ్మి సొమ్మసిల హా యని కనుదమ్ములం దేలవైచుచు, మోహంపువగలను
మోము మోమునంజొనుపవచ్చినం దప్పించి యొప్పక యవ్వల నివ్వలఁ ద్రిప్పియబ్బిన
యెడలం గొబ్బునం జుబ్బునఁజూఱఁగా వాతెరఁ గ్రోలిన నఱగన్నువైచుచు బెండు
వడి మునింగి విడువిడు మని విదళించి బదులు తెమ్మని పెదవి మొదలానం బొదివి
యాని నాలుకచేఁ బైపైఁ బెణుకుచు, చూచకముని దాకేలఁ గ్రేగన్నులం మొగిచి
నలకేలఁ జనుముక్కులు పులిమి బలిమిం దక్కితివని నురుస్కానం జొక్కఁ దేర్పడ
నొక్కుచు, మక్కువను గోటఁ సోకులం బొక్కిలి నిమిరి యవ్వలఁ దడవఁగడంగినఁ
దడంబడుచు, మెడబలిమితనంబున మోహారంబుగ దేహంబు లాహిరింగొను తెఱంగు
నకుం గఁలగి కన్మొగిచి నగుచు, నఖంబులఁ జెక్కిలి మీటుచు, లెమ్ము లెమ్మని
కమ్మవిల్తునికేళికిం బయికొల్పిన మెలఁకువలం గవకవలు చెవులం దవులం జొనిపి
తనివిదీఱక విడివడక యొడలెల్లం గలయం గరఁగించితి వేడ నేర్చితి? నవ్వ తెమీదఁ
పరాకునం బడలితి? వలసితి, విదిరా సుఖానందం, బిదిరా వింతచందం, బని
పయ్యెదకొంగునఁ జెమట లెడనెడం దుడుచుచు, బొమలుం ముడుచుచు, నన్నుం
జూడకుమని చివుక్కునం బయికొని యంతకంతకుఁ గందుకంబాడు కైవడిం
దూఁగాడుదు, మఱియునుం బాతరలాడుకృతులం గుల్కుచు, నల్లనల్లన లకుముకి

తెఱంగునం గెరలుచు, నప్పటప్పటి కాముద్దు లద్దంబునీడలం జూచుచు, నిట్లు సేసెద విది యెట్లుమఱతు రా యని భావవిరహంబుదోఁపఁ గొంతవడి నిశ్చలంబుగ నుండి తలయూఁచుచు, రాలుపువ్వులు గ్రమ్ముచెమటయు జాఱుక్రొమ్ముడియు నెఱుంగక యందందు వింతపిలుపులం బిలుచుచుఁ గంతుసాయుజ్యంబందు చందంబున దనువు లేకీభావంబుగా నంటుకొన వ్రాలుచుఁ బ్రేమాతిశయంబునం జొక్కుచుఁ, గరంగుచు, నమ్మాధవుండు రాధికాపుంభావసంభోగశృంగారక్రీడానందసాగరంబున మునుంగుచుం, దేలుచుండె నంత.

చ. తెలతెలవాఱజొచ్చె నలుదిక్కులు విచ్చె శుకీపికావళుల్
కలకలఁ గూయఁజొచ్చె మఱి కంతుఁడు విల్ రతిచేతి కిచ్చెఁ దే
టులరొద హెచ్చె జక్కవకుటుంబము విచ్చె సమీరుఁ డంత శ్రాం
తులకు ముదంబుఁ దెచ్చె మది నొచ్చె విటీవిట చోరకోటికిన్. 97

సీ. మినుకుఁజెక్కుల గోటిచెనకు లేదవి కృష్ణ!, యదిగదా నీ వెఱుంగుదువు రాధ!
సొంపుకన్నుల నిద్రమంపు లేదవి కృష్ణ!, యదిగదా నీ వెఱుంగుదువు రాధ!
కెంపువాతెరఁ బచ్చికెంపు లేదవి కృష్ణ!, యదిగదా నీ వెఱుంగుదువు రాధ!
నును మేనఁ జిఱుగాజునొక్కు లేదవి కృష్ణ!, యదిగదా నీ వెఱుంగుదువు రాధ!

గీ నిన్న మొన్నటివాఁడవు నేఁడు చూడ, కేడ నేర్చితి వీమాట లీవు కృష్ణ!
నాకు నాశ్చర్యమైనది నీకుఁ దెల్ప గూడ దదిగదా నీ వెఱుంగుదువు రాధ!

క. అని యొండొరు లిటులాడుచు, దినదినముల్ గలసి యొరులు దెలియకయుండన్
గనుమాటి తిరుగుచుందురు, కనఁబడినన్ వారి బొంకుఁగావింతు రొగిన్. 99

సీ. తనమోవి పంటికొద్దిని జుఱుక్కన నొక్క, గినుకతో విదళించుకొని పెనంగుఁ
బెనగినఁ బోనీక బిగికౌఁగిటఁ గదింప, విడువిడు మనుచు నల్గడలఁ జూచుఁ
జూపువెంబడి నొకించుక నీవిఁ జేనంట, దుడుకు మానవటంచు వెడలబోవుఁ
బోవుచో నొడిసి హా పోకుమంచు దమింప, నొడిపిమ్మట జంటనుండ వెఱచు

గీ. వెఱచి వెఱవక తెగువచే వెడలమఱచు, మఱచి మఱవని తెలివిచే మగుడఁదలచుఁ
దలఁచి తలఁవనితలపుచే దగులుపడుచు, పడుచుదనమునఁ దిరుగుఁ బైఁబడుచు రాధ

ఉ. కూరిమిఁ గొన్నినాళ్లిటులు గోపసుతుండు చెలంగుచుండి యే
మేర తలంపునంబడెనొ మెల్లన రాధను నిద్రవుచ్చి వా
ర్వారల కెల్లనుం దెలిపి రాతిరి వేకువజామువేళ న
క్రూరునివెంబడిన్ మథురకుం జని వేడుక నుండె నయ్యెడన్. 101

వ. అనిన నవ్వాలివృత్తాంతంబుఁ జెప్ప మనుటయు.

శా. వీక్షామాత్రఫలప్రదప్రళయకావేరీ మహాపట్టణా
ధ్యక్షా! శంకరపద్మనాభరఘునాథామాత్య గోపాలకా
దిక్షేమాంకరసోదరాగ్రజపదాత్మీయాఢ్య! వాఙ్మంజరీ
సాక్షాన్నందకుమారపాదయుగ పూజాలబ్ధ భాగ్యోదయా! 103

క. గంధేభగామినీకుచ, గంధాంకితవక్ష! భాగ్యకలితకటాక్షా!
బంధురహయసింధురజయ, బంధురనయకీర్తి! వంశపావనమూర్తీ! 104

తరల. మధురభాషణ! మంజుభూషణ! మాన్యసజ్జనపోషణా!
కధితపర్తన! కీర్తినర్తన! కాంక్షితాచ్యుతకీర్తనా!
ప్రధితలక్షణ! బంధురక్షణ! భాగ్యదాయకవీక్షణా!
మధితఘోరవిపక్షసార! విమానితస్థిరభారపీ! 105

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ శృంగార కవిత్వవైభవ
వెలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకట
పతినామధేయ ప్రణీతంబైన రాధామాధవ
సంవాదం బను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# రాధామాధవసంవాదము



## ద్వితీయాశ్వాసము



క. శ్రీమత్సమస్తసద్గుణ, ధామా! రామాభిరామ! తాండవకృష్ణ
స్వామిపదాంబుజదాసా! శ్రీమగదలరామదాస! చిత్రవిలాసా! 1

గీ. అవధరింపుము జనకధరాధిపతికి, మదిని సంతోష మొదవ సన్మౌనితిలకుఁ
డైనశుకయోగి రోమాంచితాంగుఁ డగుచు, నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె. 2

చ. అమరఁగఁ గార్యఖడ్గములయందుఁ బరాకయి రాధికామనో
రమణుఁడు కొన్నినాళ్ళు మధురాపురిలో విహరించి యంత భ
ద్రముగ సముద్రమధ్యమున ద్వారకయన్ పురమున్ ఘటించి రా
జ్యమునకు నాథుఁడై సకలసంపద లందుచు నొప్పె నప్పురిన్. 3

క. కులమెల్లను రక్షించెను, దలిదండ్రుల చెఱలు వాపి తాఁ బోషించెన్
భళి! యిఁకఁ దగదె "సుపుత్రః, కులదీపక" యనెడుమాట గోవిందునకున్. 4

ఉ. ఏవగవారు చేరిన సహించి తనంతటివారి, జేయుచున్
దైవము దాత తల్లియును దండ్రియుఁ దానయి ప్రోవఁగా జగ
త్పావనమూర్తి యౌ తనకుఁ బావనమాతను గన్నదేవకీ
దేవినిఁ దన్నుఁగన్నవసుదేవుని నాపదఁబాపి పోచుటల్. 5

మ. పదిరెండేండ్లగుప్రాయమందు నిటు గోపాలుండు భూపాలురన్
మెదలన్ మీఱఁగనీక లోఁగొనుచు రుక్మిణ్యాదులన్ గన్యలన్
బదియార్వేల వివాహమై సగుణరూపబ్రహ్మమై కన్నవి
న్నదిగా దీమహిమం బటంచు ఘను లెన్నంగాఁ జెలంగెన్ మహిన్. 6

క. ఈవగ సమస్తభాగ్యము, కైవసమై నిండియుండఁగా సైఁపక యా
గోవిందుఁడు రాధపయిన్, భావంబిడి కందుఁ గుందు బరవశ మొందున్. 7

క. డాయఁడు వనితామణులన్, మాయం డొకగడియమాత్రమును గను ఱెప్పల్
చేయఁడు చక్కఁగ భోజన, మీయఁడు తనమనసుమర్మ మెవ్వారలకున్. 8

సీ. పెనఁగుచో రుక్మిణి మునుపలె నీదు మే, నత్త, లేదని పల్కఁ వలసె నవ్వ
కథ దెల్పుమన సత్య గాథ రాదని పల్క, నదిగాక వినవని యసురుసురను
మరుమాట దెల్పు జాంబవతి నా నీవల్ల, వింత లేదని నీరు కంటనించు
రతివేళఁ గాళింది నుతియించుచును నాథ, రాయనఁ గ్రైవాలు వో యటంచు

గీ. బలిమిఁ బడఁతులు పైఁబ్రక్కఁ బడెడు వేళ, నోడువడుమాటల వ్యంగ్యములఁ దడబడుటలు
చదురులును సంధి నేర్పులు వెదకి చూడ, రాధ తలఁపైన మదిగుందు మాధవుండు. 9

చ. పయికొని పువ్వుఁబోండ్ల బహుభంగులఁ బ్రార్థన చేసి వేఁడినం
గయికొనఁడాయె శౌరి తనుఁ గానక రాధిక యెంతయుబ్బసం
బయిపొరలాడునో యనుచు నాత్మను జింతిలు నెట్టివారికిన్
దయయొకచోట నుండిన వితావిత యెంతవివేక ముండినన్. 10

చ. ఒకరికిఁ దెల్ప రాదనుచు నూరక చింతిలుఁ గొంతసేపు కా
దొకరికిఁ దెల్ప మంచిదని యుద్ధవుతోఁ దెలుపంగఁబోవు నే
నొకరికిఁ దెల్ప రాధ యిటు లొక్కరి కేట్లికిఁ దెల్పెనంచుఁ దాఁ
దకపికలాడునంచు మదిఁ దాలిమి వీడును వేఁడు దైవమున్. 11

వ. ఇవ్విధంబున బహువ్యథలం బొందుచు నెందునుం బొద్దుపోక దేవకీనందనుండు తన ప్రాణసఖుండగు నుద్ధవునికై దండఁగొని మంద మంద చరన్మలయపవమానకంపితాభంగ భంగనటత్కలక్వణితరణిత కలహంసకారండవ ప్రముఖపత్త్రికులగోత్త్రికులపత్త్ర వాతోద్ధూతాంబుజాతజాత పరాగరాగకషాయిత కషాయకాసార రంగత్తరంగ కణోద్ధూత జలకణ పరంపరాపరితోషిత మందార మాకంద చందన పిచుమంద కుందసింధువారతాలహింతాలతమాలమాలతీతక్కోల సాలరసాలజంబుజంబీరఖర్జూర కరవీరసహకారపున్నాగ నాగవల్లీ మల్లికాపుంజరంజితనికుంజ పుంజమంజులవివిధ కుసుమ భాసురవాసనాభిరామం బగు నొక్క కేళి కారామంబుఁ జేరి యందు నింద్రనీలసాంద్ర కుట్టిమప్రాంత ప్రవాళ స్తంభసంభూత కాంతి విభ్రాజితజాతరూప మయ కుడ్యనిబద్ధ పద్మరాగచ్ఛవిచ్ఛన్న మరకతలాపయుక్త ముక్తావితానవిలాస వాసచతుష్కరాంగణ కాంత శశికాంతశిమయ వేదికాతలంబునఁ గూర్చుండి కొండొకవడి యూరకుండి నలుదిక్కులుం గనుంగొని యుద్ధవుం డాయరమ్మని యీమర్మం బెన్నఁడేనియు నీవు వినియుందువే యని గోవిందుండు మందహాస భాసురముఖారవిందుండై యిట్లనియె.

ఉ. ఇద్ధర కెల్ల రాజనయి యెక్కడ లేని ప్రసిద్ధిఁ గాంచి నా
బుద్ధికి నీడు లేదనగఁ బొల్పువహించి తలంప నేమిటన్

బద్ధుఁడఁ గాకయుంటిఁగద ప్రౌఢతకెల్లను వెల్లిగాఁగ నో
యుద్ధవ పిన్ననాటిఁ దగు లోకపుటిగ్గులె జగద్విరుద్ధమై 13

క. పడుచుదనంబున గొల్లల, పడుచులతో నాఁడునాఁడు పైనిఁ బ్రక్కన్
బడుచు న్నందునిచెల్లెలిఁ, బడుచున్ గైకొంటి మోహపడుచున్ వేడ్కన్. 14

గీ. పిన్ననాటనుండి ప్రేమ నెందఱితోడ, గూడలేదు ? కూడి వీడలేదు ?
దాని మఱతునవన ధైర్యంబు రాదని, రాధ గాను ధృతివినోద గాని. 15

ఉ. తల్లికిఁ దండ్రి కన్నులకుఁ దమ్ములకున్ దెలుపంగరాని నా
యుల్లముగుట్టు గోప్య మిపు డుద్ధవ నీకు వచింతు రాధ కే
వల్లభ నంచు రాధమతి యత్తియటంచుఁ బ్రసిద్ధియుండగాఁ
జెల్లుగ మాకునిద్దరకుఁ జేరిక యేగతిఁ గల్గుఁ జెప్పుమా. 16

చ. గపుకముతోడ నొక్కపని గన్నఁ జేసినచో రహస్యమై
యమరదు మున్నె కొంత గొఱయైనది శౌరి స్వతంత్రవాడ; వే
దమును మతంబు శాస్త్రమును దైవము లేదని లోకమెంచు; లో
కమున వివేకి లేఁడొకఁడు కాముకధర్మము లూహసేయఁగన్. 17

ఉ. ఆరునుదూఱునుంబడియు నాచెలి యేమిటికంటివేని నే
మీరునువారునంబలెను వెట్టిదయన్ వలపింపలేదు శృం
గారరసప్రభావములు కన్నియ నాకుపదేశమీయఁగా
నేరిచినాఁడ దాని విడ నేర్తునె నేర్చిన దైవ మోర్చునే. 18

గీ. చక్కఁదనమెల్ల రాసిగాఁ జక్కఁద్రోసి, కమ్మకస్తూరి మేదించి కరఁగఁద్రోసి
చేసినాఁడేమొ పరమేష్ఠి చేతిచాసి, డాసి మెచ్చఁడె చెలిని సన్న్యాసియైన. 19

గీ. భూమి రామలమోములపోల్కి యనుమఁ, దామగల నెంతు రేటికిఁ దామరలనె
చెలియుపాదంబులకు సాటి సేయఁగూడ, దగును రాజకరస్పర్శ మందలేమి. 20

గీ. కమలగర్భంబులఁ దృణంబు గాఁగఁ జూచి, పాలుఁనుకాహళ లూనుకపోవు ననిసఁ
బోలఁతిజంఘలతో సరిపోల్ప నగునె, జనులమఱుఁగున దాఁగెడినోవల నెందు 21

గీ. ఆకృతికె రంభ యనికదా లోకరూఢి, యెట్టిరంభలనైన నయ్యిందువదన
తోడలనగఁజాలు ననినచోఁ గడమ కేమి, యతివ నెంచంగఁదరమె బ్రహ్మాదులకును 22

క. ఉన్నవె సాటున లెన్నఁగఁ, గన్నియపిఱుఁదంద మింకఁ గానందంబున్
మన్నును మిన్నును గలిగిన, యన్నాళ్లకు మఱవవచ్చునా చెలికాఁడా. 23

క. ధరఁ గవులు పక్షపాతము, గరచింతు రదేమొ కాని గతులకు సగుఁలా
కరులును ; గిరులును సరులా, గురుకుచములఁ ; కెఱుఁగలేదు గుణసామ్యంబుల్. 24

క. వచియించను రచియించను, బచరించ గణించఁ బంచబాణునితరమా
కచమేచకచకచకరుచి, కుచలికుచముకిచిలికుచకుచకేతగుటన్. 25

ఆ. క్రోల బుద్ధిగొల్పు కొమ్మవా తెరతోడఁ, బండియున్న దొండపండు సరియె ?
చేరఁ జేసికన్ను లారసి యిసుమంత, తమ్మిరేకు లనఁగ ధర్మమగునె. 26

క. కోమలిమోమున కాహిమ, ధాముఁడు సరిగాఁడటన్నఁ దామర సమమా
తామర సమమానప్పుడు, తామరసము గాక తనయథాస్థితి నున్నన్. 27

క. ఏయెడ నఖశిఖవర్ణన, సేయంగా నొక్కరివశమె ; శేషుఁడు రాధన్
బాయక వేణినెపంబై, వేయేట్రికిఁ దెలియలేక ప్రేలుచునుండున్. 28

క. అనఁగు వెరా మాకనుఁగవ, యానదు మామోవితీరు నాచనుఁగవని
క్కానదగు లక్కతోడత. క్కానీటును మఱవవచ్చునా చెలికాఁడా. 29

సీ. అల్లుఁడా రమ్మని యలరించు నొకవేళ, హాయలంగాఁ గ్రై సేయు నొక్కవేళ
దుడుకుచేసినను బుద్ధులు దెల్పు నొకవేళ, ముక్కవ ముద్దిచ్చు నొక్కవేళ
కన్నెలతో నాడ గద్దించు నొకవేళ, నొంటిగాఁ జదివించు నొక్కవేళ
తచ్చనమాటలఁ దర్కించు నొకవేళ, నూరకె నవ్వించు నొక్కవేళ

గీ. వలచు నొకవేళ నొకవేళ వద్దఁజేరుఁ, బలుకు నొకవేళ నొకవేళఁ బల్కకుండుఁ
బెనఁగు నొకవేళ నొకవేళఁ బ్రేమఁ గలియు, నలుగు నొకవేళ నొకవేళ నాదరించు 30

క. ఆనాతిమనసుమర్మము, లే నెఱుఁగుదు నాదుమర్మ మెఱుఁగునురాధా
మానవతి లోకు లెవ్వరుఁ, గానరు మామనసుమర్మకర్మము లరయన్. 31

చ. తనసునుగోటితాఁకులకుఁ దాళిన నెవ్వతెపైఁ బరాకు నీ
కని యొకకిన్కఁ దెచ్చుకొని యవ్వలిమోముయి మోడిసేయఁగా
దనివిదళించినన్ సయిప దాయనె నేఁడని చిన్నవోవు యొం
తనివచియింతుఁ గంచుపద నాచెలినెమ్మన మెంచ నుద్ధవా. 32

చ. సిక నునుగోళ్ల దువ్వుచును జెక్కిలి నొక్కుచు నేమియే నొకా
నొకకథ బూతుగాఁ దెలుప నూఁకొని కేను బరాకుగాఁ, బకా
పక నగి యేలరా విఁవు పాపఁడ ! యింతనె యింతవింతయే
రక మనుముచ్చటల్ మఱపురా విఁక రాధక నెట్లువాయుదున్. 33

శా. రారా కృష్ణుఁడ. రాఁగదోయి వరదా, రావయ్య గోపాలకా,
యేరా చుంబన మీఁగదోయిఁ యధరం బీవయ్య నీయాగడం
బేరా, కోప మదేలనోయిఁ యలిగే వేమయ్యా, మాటాడరా,
“ రారా ర ” మ్మని పిల్చు, నెట్లుమఱతున్ రాధావధూటీమణిన్. 34

ఉ. చక్కనిరూపుతోఁ గలికి జగ్గున నిల్చినయట్ల నిల్చి తా
నిక్కము గాఁగ నన్నుఁ గరుణించుచుఁ జూచినయట్ల చూచి తాఁ
బక్కన నవ్వినట్ల నగి పైకొనఁగా గమకించినట్ల నల్
దిక్కులఁ గానరయ్యెడి మదిం దిగులయ్యెడిఁ దెల్పబోయినన్. 35

క. ఆ కామిని యటు నే నిటు, "కాకః కాకః పికః పిక" యటన్న విధం
బై కవఁబాయఁగవలసెఁ బ, రాకా నావంకఁ జూడరా చెలికాఁడా. 36

గీ. ఇఁక నశక్తుని నీతిని నేఁ దపింప, నొకఁడు కరుణింపనున్నాఁడె యుర్విలోన
మనము వేసవ వ్రేపల్లెదనుకఁ బోవ వలయు నీవును బైనమై నిలువు మనిన. 37

క. ఇది మంచి దనుచు నుద్ధవుఁ, డెదఁ బొదలుచు మాట నుబ్బనియ్యక యంతన్
బోవలె నట రుక్మిణీమణి, యెదుటం బడుమలరియులుంగు లోగివినఁబడఁగన్. 38

క. మన మాటలు వినరుగదా, యని కొంకుచుఁ గృష్ణుఁ డుద్ధవా చూచితివే
యినుఁ డస్తమించువైఖరి. మనలం గని డాఁగఁబోవు మహిమ చెలంగన్. 39

క. దిగవిడిచి లోకబాంధవ, తెగవే నీవేఁగ మనకుఁ దానిది మేలా
పగలారు ననుచుఁ బద్మిని, మొగిచిన కేలనఁగఁ బద్మములు ముకుళించెన్. 40

చ. పొడుచుటయాదిగా దనుజపుంజములం దెగటార్చి యార్చి తా
వడిఁ జరమాగదానవుని పైఁబడి నాతపనుండు గ్రుంక వెం
బడి జగమెల్లనున్ బొదువఁ బైకొను చీఁకటిసోఁకనూఁక చే
నడరుతు పాకిత్రాటికొడియగ్గియనం బొడసూపెఁ దారకల్. 41

క. ముడిగొన్న కటికిచీఁకటి, కెడచూపక దీపకళిక లిండ్లఁ జెలంగెన్
వడిఁ దెంట్ల నంటనీయక, పొడసూపినకనకముకుళములనగ మిగులన్. 42

వ. అని యివ్విధంబున నవ్వనజనాభుండు గొన్నిప్రొద్దుపోకమాటలాడుచు, బెండ్లి చవికలోనికిఁ జని యుద్ధవునిం బనిచి రుక్మిణీకేళికాగృహంబునకుం బోయి తదను గుణప్రియభాషణంబుల సంతోషంబు సేయుచుఁ దవపయివంబునకు నుపాయంబు గానక సెపంబు వెదకుచు మనంబున ఘనంబగు పరితాపంబునఁ బొరలుచుండె నంత నక్కడ. 43

క. తను విదురఁబుచ్చి వేసవ, వనరుహానయనుండు చనినవార్త చిలుకచే
వెనుకన్ విని యారాధిక, ఘనతరశోకాబ్ధి మునిఁగి కళకళపడుచున్. 44

సీ. ఒకరిఁ బిల్వఁగఁబోయి యొకరిపేరునఁ బిల్చు, నమ్మచెల్ల! యటంచు హరిఁ దలంచు
నొకటిఁ జూడఁగఁబోయి యొకటిఁ దప్పక చూచుఁ, దప్పుగాయిదియంచుఁ దనుగణించు

నొకటి సేయఁగఁబోయి యొకప్రయత్నము సేయు, మంచిదానవటంచు మదిఁ దలంచు
నొకటి పల్కఁగఁబోయి యొకటి యేమేఁ బల్కు, మోసమాయెనటంచు మోము వంచు

గీ. మారు నిందించునదె తోఁచె శౌరియంచు, బయలు గబళించుఁ బలవించుఁ బల్కరించు
నిజము గాదంచుఁ గన్నుల నీరునించుఁ, గలకలను నవ్వుఁ గలయించుఁ గలవరించు. 45

గీ. బయలు వెడలంగఁజాలదు భయముచేత, నిముడుకొనియుండఁజాలదు భ్రమముచేతఁ
గలికి యపుడోదమునఁ బద్మకరిణికరణిఁ, నొట్రుపడి కొట్టుకాడును బ్రొక్కులాడు. 46

సీ. మధుకైటభారాతి మధురవాచారీతి, నొంటిగాఁ జింతించు నొక్కవేళ
హాటకాంబరధారి యదె వచ్చె నని చేరి, యున్నట్లు బయలాను నొక్కవేళ
పాథోధిశాయిపైఁ బదము పాడఁగఁబోయి, యూరక కేనొ గొణఁగు నొక్కవేళ
మనమునఁ బేనఁగొన్న మర్మకర్మములకు, నడుకుచు వెతనొందు నొక్కవేళ

గీ. దిక్కులేదని విధిమూలు నొక్కవేళ, మ్రొక్కి దయఁజూడుమని వేఁడు నొక్కవేళ
నోయదూద్వహా యని చీరు నొక్కవేళఁ, దా మఱికలంగి రాధికాకోమలాంగి. 47

గీ. మఱియు నొకయింత శయ్యపై మఱవు లేక, బాధపడి రాధ తడఁబడి బడలి నిల్చి
పిల్చి హాయని తాఁ బ్రలాపింపఁగోరఁగఁ, గృష్ణు వటుకూర్చి చెక్కునఁ గేలు చేర్చి. 48

క. హా కృష్ణ ! హా యదూద్వహ !, హా కేశవ ! హా ముకుంద ! హా గోవిందా !
హా కమలనయన ! హా హరి !, హా కమలాహృదయలోల ! హా గోపాలా ! 49

మ. నిను నాదైవముగా మదిం దలఁతు నీనిద్ధంపు నెమ్మేను నీ
గొనబుం జెక్కులు నీసుధాధరము నీగోమైన నెమ్మోమునుం
గని యుప్పొంగుచు నాతపఃఫలముగాఁ గైకొందు నేఁ డయ్యయో
నను నేలా గెడఁ బాయఁజాలితివి కృష్ణా ! యెంతనిర్మోహివో. 50

మ. ఒకనాఁ డించుక చూడకున్న నిను నాఁ డూరెల్ల నేనే మొకం
టికి నిస్సారముగాఁగఁ గానఁబడు ; నా డెందంబు నిన్ జూచినం
దుకె ముల్లోకముఁ దానె యేలుగతి నెందున్ సంతసంబందు ; నేఁ
డకటా యేమియు లేక నీవు ననుఁ గృష్ణా ! యింతగాఁ జేయుదే. 51

ఉ. అక్కట యెన్ని ముచ్చటల కాసపడుంటి మనంబులోనఁ దా
నొక్కటి యెంచ దైవ మది యొక్కటి యెంచుట సత్యమాయె ; నీ
యక్కునఁ జెక్కుఁ జేర్చుకొననైతిని నా కిది మోసమాయె న
న్నెక్కము పాయకుండుమని నిన్నెదనమ్మితిరా మనోహరా. 52

చ. కదియక నీమవారివలెఁ గన్నులఁ జూచినవేళఁ గొంకనే
పది యిది ప్రొద్దుపోకలవిహారము సల్పిన నింత రాదుగా
మొదలనె దూర మెంచవలె మోసము వచ్చెఁ గేమిసేతు హా
మది మదినుండి యేల నిను మాలిమిచేసితి జీవితేశ్వరా. 53

క. ఆసించి నీవు చేసిన, బాసల కే నమ్మియున్న పసిగోల నయో
దోష మున కింతిలో మది, రోసితి వింతటిదయాపరుండవొ కృష్ణా. 54

చ. అని విలపించి నీవు విడనాడిన నెవ్వరిదాననంచుఁ గా
మిని మొగమందు చేల యిడి మెల్లనె యేడ్చెను వెక్కి వెక్కి వా
ల్గనుఁగవ వెచ్చనీరు చిఱుకాలువలై యఱికంటి నిక్కుచ
న్గొనలను జాఱఁగా మెయి గగుర్పొడువన్ మది తాల్మివీడఁగన్. 55

గీ. అంతఁ బెంపుడుచిల్క యయ్యతివఁజేరి, యక్క యదియేమిచేసెద వళుకుదీరి
చెలులు వినియెద రెందుకే చింతఁగుంద, వలదు కృష్ణునిపదమాన నిలువు మనిన. 56

క. కనువిచ్చి చూచి రాధిక, తనువేఁడెడుచిలుకతోడఁ దా నిట్లనియెన్
వినవే చిలుకా కృష్ణుఁడు, తనునొల్లని వెనుక నాదుతను వేమిటికే. 57

క. ఇల్లేటికి మగఁ డేటికిఁ, ద ల్లేటికిఁ దండ్రి యేల ధన మేటికి నా
యల్లునిరూపము కన్నులం, చల్లనఁగాఁ జూడఁగనినఁ జాలదె చిలుకా. 58

చ. కల్లరి గాఁడు లోనెనరు గల్గినవాఁ డదిగాక వావి మే
నల్లుడు రూపవంతుడు మహాగుణశాలియటంచు నమ్మి నా
తల్లిని దండ్రినిన్ మగని దమ్ముల నన్నల రోసి తన్ను నే
నుల్లములోన దేవు డనియున్నది కీరమ నీ వెఱుంగవే. 59

ఉ. వీథులలోన లేవగవు వెన్నెల చల్లఁగఁగాయఁ బూర్ణచం
ద్రోదయమైనరీతిఁ గళలూనినవాని మొగం బెగాదిగ
న్నాదిగులెల్లఁ దీఱఁ గని నాదిగదా తగుభాగ్య మార నా
మీఁదను స్వామి కెంతదయ మేలుభళా యనుకొందుఁ గీరమా. 60

గీ. చందురునిజూచి సంతోష మందులీల, జూచి పొంగుదు హరి నది చూడలేక
యమ్మలక్కలు మిన్నక యాడుకొందు, రేల కొఱయౌ నిందుల నేమిగంటి. 61

చ. చలమున మచ్చుచల్లిన నిజాలమునున్ దయవాఁడటంచు నే
వలచితిఁ గేతకీకుసుమవాసనకై భ్రమనొంది తేనె లో

పలఁ గలఁచుచు నాసఁగొని పైఁబడఁ బుప్పొడి రెండుకన్నులం
దొలఁచిన లేవలేక పడుతుమ్మెదతో సరియైతిఁ గీరమా. 62

చ. మది మగనుండలేక బతిమాలిన నామది నాడె కొందునో,
కొదవలు గాఁగ నాడుకొను సంపుల నందునో, యింత కోర్చు నా
బ్రదుకున కందునో, వెతలఁ బాల్పడజేసిన బ్రహ్మనందునో,
యది యిది యేల నావలపు లాఱడిఁబెట్టిన శౌరి నందునో. 63

ఉ. ఎన్నిటికంచు నేవగతు నిప్పుడు నాతలవ్రాఁత యేమి గా
నున్నదొ యింతఱంతపడ నోర్చినదానికి నెంతచందఁ గా
నున్నదొ కానిపోనితగు లూనిననామది కేమిసేతుఁ గా
నున్నది కానపోవ దని యుందునె యుండదు నెమ్మనం బికన్. 64

మ. అనఁగా రాదని కాక యోచిలుక ! నా కాశౌరి యూరెల్ల హా
యను కాలంబున నేఫలంబొసఁగి యన్యాధీనతం జెంది నేఁ
డనుఁ బ్రార్థించినకొద్దిఁ దాబిగియ వంతం జింత నంతంత యిం
తనఁగారానివిరాళిపాలుపడి లోనైయుంటి నన్నింటికిన్. 65

తే. నేఁడైన వానియాసల, పోఁడిమి విడనాడి నేను పొలిసెదనన్నన్
వాఁడె చెడినాఁడు మారుం, డాగ నితని కేల పువ్వుటమ్ములు విండ్లున్. 66

చ. అనుచు ననంగునింగుతెచ్చి యంగనలన్ మము నొంపఁ గాని పెం
పను గొఱగావు నీయొడలు భస్మము గా మగవారిఁ జేరనుం
జెనకఁగలావె లావుగలచిల్కగుఱ్ఱాని బిరానఁ జేరి సి
గ్గున బ్రతుకందలంపు మదిగో యిఁక నెన్నకు బంటుపంతముల్. 67

క. దమయంతి రాయునింతిని, బ్రమయించినరీతి పట్టిభ్రాంతిని నన్నుం
దమి ముంచకు మరు లెంచకు, మమిలించకు పువ్వుటమ్ముఁ గుదిలించ కిదన్. 69

గీ. అని యనంగుఁడ వీవు నిన్నఁనఁగ నేమి, నేమిరీతిని నెలనోఁచె నింగి నిందు
నిందుఁ బగఁజూడుమని మళ్ళి తీవు గాక, కాఁక నను ముంచలేవని కలికి యనియె.

సీ. పక్షిరూపలము పైబడిఁ మళ్ళి బ్రతుకుదే, లలిఁజూపు నింద్రజాలంబు గాక
యిలఁ జకోరములు వెన్నెలఁ గ్రోలి నెగడుదే, వగఁజూపు కరలాఘవంబు గాక
విసవిస మొకవింతతీరు గాఁ దోఁచెదే, వెదచూపు బహురూపవిద్య గాక
రాహువు మ్రింగఁ గోఱలు సోఁకి వెదలుదే, వెదవెదఁజూపు గారడము గాక

గీ. కల్లనైయున్న జగమెల్లఁ దెల్లఁజేసి, భ్రమలముంతువె కనుకట్టుబలిమిగాక
కాక యేపాటి నిజరీతి ఘనుడవైతి, నేఁడు గాదోరి నీవారి నీరజారి. 70

ఉ. అననవింటివాని మది నల్లనిగా నెజినమ్మినావు; లో
కానఁ గుమారుఁడుఙ్ జనకునకై వడి నాగద; మేనమామగం
డానజనించినాఁడని వినంబడెఁ దండ్రిని మించినాఁడు ద్రో
హానకు నింకనైనను మృగాంక మృగాంకునిఁ జేరు మూరకన్. 71

క. కాదేని నీదువెన్నెల, వేదన నామీఁద జూపి విను ప్రాణములన్
లేదనిపించును పంతము, లేదా యల్లునికిఁ దోడు తే లెమ్మ వడిన్. 72

వ. అని యారాధావధూతిలకంబు తలపెంపుడు చిలుకం జేర్కొని.

చ. ననవిలుకాఁడు బోయ; నెల నా కలదాయ; యిదేలపేరి బా
ధను బడఁజాల; జాణవుగదా చిలుకా, యొకగాథ లేదుగా
యన "విను సన్నుతాంగి తెలియంగ ననంగ ననంగ నొక్కరా"
జన విని యంతఁ గేల జెవు లల్లన మూయును నీశ్వరా యనున్.

క. ఇవ్వగల రాధికామణి, నెవ్వగలం బొగులఁజిలుక నేర్పునఁ బలికెన్
జవ్వని మీగోపాలుని, నవ్వుచు నేఁ దోడితెత్తు నన్నింకవుగా. 57

గీ. ఆలుమలలాయెఁ గృష్ణుఁ డందరిగి యిప్పుడు, సకియ నాకున్నె పిలిచిన జాలుఁగాని
భ్రమసి వెదకెదుగాక నీపతిమనంబు, కదలకున్నది నీచెంతఁ గంటినేను. 76

వ. అనినవిని నవ్వి యవ్విలాసినీతిలకం బిట్లనియె.

చ. వలచినవారు లేరో; పరివారలలో నగుబాటు గాఁగ నా
వలెఁ జరియించిరే; యొకరివంతుల కేట్రికి బోవ. దాత నా
తలనిటు వ్రాయఁగావలెనె; దైవము దూఱఁగ నాయమానె; నేఁ
దొలిమెయి నేమినోము లెటునోచితినో యిదిగంటి నిమ్మెయిన్. 78

ఉ. కంటికి నిద్రరాదు చిలుకా! కలకాలము వేగఁజాల నీ
వంటియనుంగుఁ గల్గి తగవా మగవారలఁ బాసియుండ నే
నొంటిగ నుండి నిన్ననుపనోప; నయో యిటు లేల జాగు; నీ
వెంటనె జంటచేసికొనవే; పదవే వనమాలిపాలికినా. 79

క. నీకుం గలిగిన తెక్కులు, నాకమరకపోయెఁగాక; నా కబ్బినచోఁ
బైకగని యిందిరారమ, ణీకాంతునిఁ బొమ్మమీఁద నిలువనె చిలుకా! 80

క. హా మ్మనవలె ; వన్నియెడఁ, బొమ్మనవలె ; నీవు పోయి పురుషోత్తముతో
ర మ్మనవలె ; దేహమునీ, సొ మ్మనవలె ; విడువవలదు సు మ్మనవలయున్. 81

మ. తను భోగింతుఁ, దను న్వరింతు ననుచింతం గాదు నో యింక నా
పని నాకేటికి ; సిగ్గువేరె తొలుతన్ బ్రాయిండి యిల్లాలిఁ గా
వునగాఁ జేసి తుదిన్ ద్యజించి తిరిగే పుణ్యాత్ములం జూచినం
తనె చాలున్ ఫల ; మీశ్వరేచ్ఛ యెటులైనం గాని యామీఁదటన్.

మ. తన కేరుం దనపల్కులుం దనవగల్ తా నాయెడం జేయుమ
న్ననయు న్నెమ్మది నాఁటియున్న దిఁక మానంజాలఁ జింతాభరం
బున డెందంబున కొక్కటన్ విరసమున్ బుట్టించి పోఁ గాని ర
మ్మనవే యిల్లనివాని కేల యితరవ్యాపారచాతుర్యముల్.

ఉ. ఇంగితమెల్లనుం దెలియ నెంతయు జాణవు నీవు ; నీవచ
స్సంగతి యేరికిం గలదె ; సన్నుతిగా దిది శౌరి నేను ను
త్సాంగముఁ గూడినప్పటికిఁ బొల్పుగఁ దోఁచును నిన్ను మెచ్చఁగా
బంగరుచిల్క ; నిన్నిపుడు పల్కఁగ నేర్తునె పేదపల్కులన్. 84

గీ. అనుచుఁ దనచేతివ్రాలఁ బద్యములు రెండు, వడిగ లిఖియించి టెక్కలనడుమ నునిచి
చిల్క ! నే నేమి దెల్ప నీచిత్తమిఁకను, దనదుభాగ్యము పోయి రమ్మనుచు ననుప. 85

క. గగనమున కెగసి మధురా, నగరముఁ గని యచటఁ గనులనాథుఁడు లేమిన్
దగఁ దెలిసి ద్వారకాపురి, డిగి యచ్చటిసగరు సొచ్చి డెందం బలరన్. 86

క. తమకమున భోజకన్యయుఁ, గమలాక్షుఁడుఁ బడుకటింటఁ గవగొనియుండన్
సమయము గాదని యచ్చట, నమరినచిలుకలను గూడి యాడుచు నుండెన్. 87

వ. అంత. 88

మ. తళుకుందంతపుఁ జెక్కడంపుఁబనినిద్రాజాళువాకీలుబొ
మ్మలు వల్వంకల మాడిగంపునడగుమ్మల్ గాఁ బనుల్ సేయఁ గాఁ
గలుఁ గుంచంబచ్చులకోళ్ళమంచముపయిన్ గోపాలుఁ డారుక్మిణీ
లలనారత్నముతోడఁ గూడి పాలయల్కన్ మార్మొగం బానెడన్.

మ. చిలుకం జూచి బిరాన లేచి నగుచున్ జేసాచి రా రమ్ము ము
ద్దులగారాబుమిటారిచిల్క యన నెంతో వేగఁ బాదాంబుజం
బులపై వ్రాలఁగ గేలిపైఁ దిగిచి యింపుల్ గుల్క ముద్దిచ్చి టె
క్కలఁ జక్కం బడదువ్వుచు న్నిజదృఢాంకంబందు లాలించుచున్. 90

క. నందయశోదలుఁ బరమానందంబున నున్నవారె? నన్ దలఁచెదరే
యందఱిమనవారందఱు?, గొందఱు నన్నెపుడు దూఱుకొందురె కిసుకన్? 91

ఆ. చిన్ననాఁటనుండి నిన్నుఁ బ్రాణంబుగాఁ, బెంచుకొన్న రాధ యించుకంత
తడవు వీడఁజాల దెడఁబాసి వచ్చుటఁ, జింతసేయు నేమొ వింత కలదు. 92

క. అని వనజాయతలోచనుఁ, డన విని యింతింతగాని యానందముతో
నెనరింతే లేకయుండినఁ, జన వగు నే యనుచు మదిని సంభ్రమ మొప్పన్. 93

ఉ. ఓసుగుణాభిరామ పురుషోత్తమ దేవరవారు పూర్ణసిం
హాసనపట్టభద్రబిరుదాంకమహోన్నతులై భవత్పద
వ్యాసలసత్కిరీటవసుధాధిపకన్యక లాడికంబు లా
సాసలఁ జేయుచుంటఁ గనినంతను వింత మఱేమి కల్గెడిన్. 94

ఉ. అన్నియు నుద్ధరించెదనటంచు నటించినదాని కేమిపో
యె న్నెల కొక్కసారి మొగ మించుక చూపినఁ జాలు నేల యీ
యెన్నిక లంచుఁ గొందఱు నిజేచ్ఛల దూఱుటదక్క నెవ్వరున్
ని న్నొకపాటివాఁడని గణించెదరే యదువంశభూషణా. 95

వ. అని పలికిన. 96

క. ఇమ్మాటలు మఱి మఱి విన, ముమ్మరమై తనదు చెవికి ములుకులు గాఁగా
ముమ్మడి నలుమడి కోపము నెమ్మదిలోఁ బొడమ రుక్మిణీమణి యంతన్. 97

ఉ. జాఱినకొప్పుతో జెవికి జాఱినపాపటబొట్టుతో దిగం
జాఱినపైటతో నొఱగజాఱిననీవికతో నొకింతగా
జాఱినసొమ్ముతోఁ జెమట జాఱినకస్తురిబొట్టుతో ముడిం
జాఱినపూలతో నొడలు జగ్గుమనన్ వడి లేచి దిగ్గనన్. 98

గీ. లేచి తనబోంట్లమీదను లేనికోప, ముంచి గుప్పించి పిలిచి గద్దించుకొనుచు
సైగగా బోవ దన కది సైగ గాఁగ, శౌరి ముసిముసినగవుతో నూరకుండె. 99

గీ. చిలుకకడ జూచి నీకేల చిన్నవోవ?, నెంత లే దిది; నీకు బనేమి; యొకరి
ప్రకృతి గావని మాన్పంగ నొకరివశమె?, చెలియ యేమనె నవ్వల దెలుపు మనిన. 100

చ. చెలియ కికేమియున్నవి విశేషము లయ్యెడ నెన్న మాటికిన్
దెలుపగ వేసటయ్యె జెలిచెనత జూచిన గృష్ణ కృష్ణ; యా
పొలతుక యేమిభాగ్యములు పొందెడినో తెలియంగరాదు; వే
డ్కలగనియైననీదుసముఖంబున దెల్పగరాదు తద్వ్యథల్. 101

మ. మదనాంధ్రముని కీర్తి నేమి వినినన్ ; కందోయిఁ దా నేమిగ
న్నన్ ; నెమ్మోమున నేమి సోఁకినను ; కృష్ణా ! దేవకీనందనా !
యానిపల్కున్ ; జెల్వమేమ నేమనుదు నావా ! మోహ మోహాహహా ; నె
మ్మిన మారారి ; వికార మందఁ దిరా మందారపుష్పాకృతిన్ . 102

క. అపకృతి చేతఁ బెరిఁగిన, పాపంబున వాదుపల్కు ప్రత్యక్షము గా
నోప దయిన నీ సేవలు, ప్రాపించుటఁ గొంతకొంత పాటింపఁదగున్. 103

ఉ. ఘనకుచపాళి పాళి నినుఁ గస్తురిచేఁ గొనగోట వ్రాసి యి
య్యానమువ్రాఁ నెన్నఁ డుందు సకటా యనుచున్ దలపోసి పోసి వె
వ్వేకనుసీరు పై పయిని జాఱఁ గపోలముల నాని చేచుఱు
కన్న విదళించి యెంతఘనమాయెను జీవమటంచుఁ జింతిలున్. 104

క. చక్కని మ్రోల నేమో, గ్రక్కునఁ దా వ్రాసి యొసఁగెఁ గైకొను మనుచున్
జెక్కుల నుంచిన పత్త్రిక, మక్కువ నెడలించి శౌరిముంగల నిడియెన్. 105

క. పురుషోత్తముఁ డా పత్త్రిక, నిరుకేల గ్రహించి మొదల నీయ వటంచున్
మురియుచు గన్నులనొత్తుచుఁ, దఱచుగ దలయూఁచి చదివె దానిట్లనుచున్. 106

ఉ. సకలగుణాభిరాముఁ డగు శౌరికి రాధ నమస్కరించి మి
న్నక యొకవిన్నపంబు ; నిను నమ్మినవన్నియునున్ ఫలించె న
త్తకు మఁగఁ డెల్లు దంచును వితావిత తేఁకుఁ దేర వట్టియా
డిక లివి యేల నాకు నెగడెన్ నడి మాన్పుము మేలు నీకగున్. 107

వ. అని చదువుకొని తద్భావంబులు పలుదెఱంగులం బరికించి వాత్సల్యంబును ముగ్ధతనమును ప్రౌఢతనమును వ్యంగ్యంబుగఁ దోఁప వింతయుఁ జింతయు దొంతరగా నంతరంగంబునం గదురఁ గొంతవడి యూరకుండి యవ్వలం గనుంగొని యందు. 108

క. ... ... నిను మది నెఱవను
... ... నను నెవరు మఱచి కినియకు నాపై
... ... కనికర ముంచర
... ... యని తలఁచినపుడె యెనసెద ననరా. 109

( ఇది గుప్తచతుష్పాదకందము. )

వ. అని చదువుకొని యది గణబద్ధం బయ్యును బద్యంబు గాని విధం బేమి యని యూహించి యస్త్రాన్నమంబు ముందువెనుకల రచియించి పరిత్యాగలోభంబున మన్నా

మంబులు (నాయిక మనంబునఁ దలంచుకొన నుంచుకొనియెనని తానె ప్రసంగించి
యవియే నాలుగు విధంబుల నిట్లనుచుఁ జదివె. 110

క. కృష్ణా నిను మది మఱవను, కృష్ణా నను నెనరు మఱచి కినియకు నాపైఁ
గృష్ణా కనికర ముంచగ, కృష్ణా యని తలఁచినపుడె యొనసెద ననరా. 111

క. కృష్ణా కనికర ముంచర, కృష్ణా యని తలఁచినపుడె యొనసెద ననరా
కృష్ణా నిను మది మఱవను, కృష్ణా నను నెనరుమఱచి కినియకు నాపై. 112

క. నిను మది మఱవను కృష్ణా, నను నెనరుమఱచి కినియకు నాపైఁ గృష్ణా
కనికర ముంచర కృష్ణా, యని తలఁచినపుడె యొనసెద ననరా కృష్ణా. 113

క. కనికర ముంచర కృష్ణా, యని తలఁచినపుడె యొనసెద ననరా కృష్ణా
నిను మది మఱవను కృష్ణా, నను నెనరుమఱచి కినియకు నాపైఁ గృష్ణా. 114

క. అని చదువఁ బొగడి కృష్ణుఁడు, మనమున సంతోష మంది మక్కువఁ జిలుకన్
గనుఁగొని గ్రక్కునఁ జను మింక, ననువుగ నే రేపె వత్తు నని తెల్పవలెన్. 115

గీ. మొదలఁ బదివేలనేరము ల్మోచియున్న, నేను నేఁ డింక నేమన్న నిక్కముగనె
రాధతోఁ దెల్పు మొకమాట "రమణి రేపె
నీదుపదమాన వచ్చెద నిజ" మటంచు. 116

క. అని మారుకమ్మ యొసఁగిన, వినయంబునఁ గొని శుకంబు వినువీథి వడిన్
జనుదెంచెను బ్రేమ లైకు, మునుపటితనపక్షపాతమును గనుపింపన్. 117

గీ. వచ్చుచిలుకఁ జూచి వనిత దిగ్గున లేచి, చేర చాచి తిగిచి గారవించి
పోయినట్టిపనులు కాయొ పండో యన్నఁ, బండుపండు రేపు పండు గనిన. 118

క. ఇంత మొగ మంత చేసుక, యంతింతనరాని నిస్తులానందముతోఁ
గొంతవడి యూరకుండి త, నంతనె రాచిల్కఁ జూచి యంగన వల్కెన్. 119

ఉ. కంటివె కన్నులార నవకంతునిరూపము ; వీనులారఁగా
వింటివె వానిమాట ; లోకవెంబడి నైనను నన్ దలంచునా ;
యంటివె కృష్ణ కృష్ణ యని ; హా శుకమా ! పొడఁగంటి నీవు మా
వంటియదృష్టహీనులకు వానిగనుంగొనుభాగ్య మబ్బునే ? 120

క. ఉన్నాఁడా గోపాలుఁడు ?, విన్నాఁడా నీదుమాట ? వేడుక వచ్చే
నన్నాఁడా నీతోడను ?, మన్నాఁడా యేడనైన మక్కువతోడన్ ? 121

ఉ. ఏమనె నేమిపల్కె నిను నేమనిపంపెను నన్ను దూరెనో
రామనెనో పరాకిడెనొ రాజులయేలిక కృష్ణమూర్తి నా

స్వామి ముకుందుఁ డచ్యుతుఁడు వారిజనాభుఁడు క్షేమశాలి యై న
క్షేమమనె; నేమి చెప్పమనె; నేమని పంపెను; నిన్ను నేమనెన్. 122

క. అదియుండె నేను వ్రాసిన, పదపద్యములెల్లఁ జదివి భావముఁ గనెనా
బదు లేమి పంపెఁ దెన్నని, పొదలుచు నాలేఖఁ గొనుచుఁ బొలఁతుక నగుచున్. 123

క. పత్త్రికల వ్రాయుజాణవుఁ, బత్త్రికలను వ్రాయు టేమిప్రౌఢి యటంచున్
బత్త్రికఁ జనుగవపై నిడి, పత్త్రార్థము సౌమ్యుఁ డెన్నె పత్త్రిక యనుచున్. 124

ఆ. చిలుకతోడఁ గొంతసేపు మాటాడుచు, మొదలుకొనినచోటె మొదలుగా, గ
నాల్గుచరణములును నాలుగువిధములై, తనరుపద్య మిట్లులనుచుఁ జదివె. 125

క. తలఁచితఁ గలసెన రాధా, తల పసుపురుశరములనను దలఁకక రాధా
నెల నిఁకఁ దలఁపకు రాధా, కలచిలుకలపలుకులనను గలఁగకు రాధా! 126

వ. అని చదువుకొని తచ్చాతుర్యంబునకు మెచ్చుచు నీపాటికటాక్షంబున్న దే యశోదా గర్భరత్నాకరరాకాసుధాకరున కని తనపెంపుడు చిలుకను బ్రియంబుదొలఁక దువ్వుచు నీవల్ల నుల్లం బీపాటిచల్లఁదనంబున నుల్లసిల్లె. శుకకులరత్నాకరరాకా సుధాకరా! ద్వారకాపురం బేకరణి నుండె నందలి వింత లేచందంబున నుండె నందు గోవిందుం డేయందంబునఁ గొలువై యుండె నంతయుఁ దెలియఁ బలుకవలయు ననిన రాధికావధూతిలకంబునకు ముద్దుచిలుక యిట్లనియె. 127

సీ. అష్టదిక్పరిముంచితాట్టంకపవిచిత్ర, గోపురం బలద్వారకాపురంబు
మహీపదాంభోజాతమణిమయమహనీయ, నూపురం బలద్వారకాపురంబు
సకలవైభవభోగసరణీపరాజిత, గోపురం బలద్వారకాపురంబు
కమలాంబకునిఁ గన్నకమలాలయకు నుండఁ, గాఁపురం బలద్వారకాపురంబు

గీ. నీలపద్మమహాపద్మనిరుపమాన, విజయకరశంఖవరకుందవినుతమకర
కచ్ఛపముకుందశోభితఘనలసదల, కాపురం బగు నలద్వారకాపురంబు. 128

చ. పురవరసౌధవాటముల బోటులపాటలఁ జంద్రకాంతముల్
గరఁగి ప్రవాహముల్ దివిముఖంబున రా వినువాఁక యంచుఁ ద
త్తరమున వేసవన్ సురవితానము తానము సేయఁ గ్రుంకుచో
"హారిరో హరీ" యటంచుఁ బరిహాసము సేయుదు రవ్విలాసినుల్.

చ. అల రెడివీటివజ్రమయహర్మ్యరుచుల్ దివిఁ గప్పఁ బల్కుతో
య్యాలిఁ గనుఁగొంటి నంచు నపు డానరవాహనపుత్త్రివేశ్యకున్

జెలఁగఁగ వేలుపుందపసి చేయు నమస్కృతి మాటిమాటి ; క
క్కలికియు నేను గా ననును, గాంతుఁడు విన్నను నేగి పొమ్మనున్.

చ. పుడమిజనంబు లీయునినిఁ బూర్వగిరిం దగి పశ్చిమాద్రిపైఁ
బడునని యాడుకొందు రది పట్టరు ద్వారకలోనివార లె
క్కడిమతమంచుఁ; దూరుపుటగడ్తను దోఁచుచుఁ గోట యెక్కి యా
పడమటగడ్త గ్రాలు నొకబాలునిగాఁగనుఁగొందు రయ్యెడన్. 131

గీ. మేటి నాకం బెఱుంగును గోటపొడవ, గడ్తఁగలలోఁతు నాగలోకం బెఱుంగు
దీనిలోఁ దారతమ్యంబు దెలియరాదు, దానఁ బ్రథమ తృతీయ భేదములుతక్క. 132

సీ. ఆచారవంతులౌ నచటిభూదేవతల్, వావిదప్పినబ్రహ్మవార్త నగుదు
రపజయం బెఱుఁగని యచటిరాచకొమాళ్లు, రణమునవెనుకయౌ రాము నగుదు
రందఱుఁ బోషించు నచటికోమటులాది, భిక్షుకురోయు కుబేరు నగుదు
రధికధాన్యసమృద్ధి నచటిశూద్రులు తన, హాలము వ్యర్థమటంచు బలుని నగుదు
రచటితేరులు మేరువులైన నవ్వు, నచటిగజములు శక్రునిగజము నవ్వు
నచటిహయములు పవమానులైన నవ్వు, నచటిభటకోటి నిప్పులనైన నవ్వు. 133

చ. ఘలుఘలుఘల్లుఘల్లుఘలుఘల్లను ఘంటల నొప్పఁ గాలిపోన్
గొలుసులు మందపున్నడలకుల్కులు హుంకరణంబు లారచూ
పులవిడిబాటు లారజపుఁబూనిక లాసికలున్ మదోద్ధతుల్
దలఁపఁగ గంధసింధురములా యనఁ బొల్తురు వారకామినుల్. 134

క. వడి గలిగి మృదుపదంబుల, నడవడిచే మిగిలి యా ననన్ సాదుల కె
క్కుడునగఁ జొప్పడుఁ దగునడ, గడు నలవసఁ దురగవితతి గరిత లనంగన్. 135

ఉ. అంగన నీపు పువ్వులుఁ గలాపెపె ; యౌ మగవారు లేరు ; లే
కం గడిదేరినావె నళు లౌ ; వెలకుం గొనుమోవి తేనె ; బం
తిం గనకుండ దాఁచి ; తది జేరకుఁ జూపెదురా విటుండు ; కొ
న్నంగడి మారుబేరములె ; యంచు వచింతురు పువ్వులావికల్. 136

గీ. అట్టిపట్టనమెల్ల నేకాధిపత్య, ముగ ధరింపుచున్నాఁడు నీమగఁడు నేఁడు
నీవె పట్టపుదేవి గానొప్పు దీవు, మమ్ము నేరీతిఁ బ్రోతువో మఱపులేక. 137

ఉ. నీడలువారుమేడల ననేకము చూచితి నాఁడు మేడ లా
మేడలలోన నొక్కమగమేడ భవత్పతికొల్వుమేడ యా

వేడకుఁ దూర్పుపక్క నొకమేడ చెలంగఁగ శౌరితోడ నీ
వేడుక నెవ్వ రాడ్యు లన మీపువుఁబో డనిపల్కె నవ్వుచున్. 138

గీ. మఱువ మఱ రాలవవికె నీమగఁడు నేను, నీప్రసంగము లాడ నానీడ పార
నచట నొకచిల్క నను జూచినట్టులుండె, నవల నెవరన నెవరులే రనియె శౌరి. 139

చ. ఇటు నను బంపినన్ మొదట నే నటు వోయినత్రోవఁ దప్పి చీఁ
కటి నడిమిద్దెటెండఁబడి కాంతమణుల్ బయులంచు భ్రాంతిచే
నట నెగఁబ్రాఁకి తాకి తడవాడుచు గూడులవెంట దూరి యొ
ప్పొటిహారిముంగలం బడి కృపన్ గడవెల్లితి త్రోవచూపఁగన్. 140

మ. ఒకకీల్గోపురమందు వింత గనుఁగో నూహించి యామైన నిం
చుక కాలూనిన గిఱ్ఱునం దిరుగ నచ్చోఁ బోవరాదంచు బు
ద్ధికిఁ దోఁచెన్ మఱియొక్కవింత విను మాతీరంబునం దొక్కబొ
మ్మ కరం బెత్తి నిజాలకున్ బడఁతిగా మల్లాడుచు న్నవ్వితిన్. 141

ఉ. గోలతనంపుఁజిల్కయని కోమలి నవ్వకు ; నీవు ముందుగా
చేలవుగాకతప్ప దొక పెద్దహజారముఁగన్న వీఁడు గో
పాలుఁడు వీఁడు కృష్ణుఁ డనుభ్రాంతిని జిత్తరుబొమ్మలెల్ల నా
పోలికనున్నఁ జైఁబడక పోదువె ; తాళుము ; రేపె చూచెదన్. 142

క. సైచు మని పలుక రాధిక, యోచిలుకా యింత యేల యుడికించెదవే
నీచిత్తము నాభాగ్యం, బౌ చతురం డెపుడు వచ్చు నని యడుగు నెడన్. 143

గీ. కొంద ఱాభీరపూర్ణ రాకేందుముఖులు, నగుచు నేమక్క విన్నైనావు నీవు
మాటలేమన మఱి యేటిమాటలనుచు, నొకట్టిపైఁబెట్టు నిదెమాట కొకటియుండ. 144

వ. అనిన నవ్వలివృత్తాంతంబు చెప్పమనుటయు. 145

ఉ. సింధురగభీర ! శీతకర శేఖర జాటనటద్వియన్నదీ
బంధురశీకరప్రకరపావనసత్కవితాధురంధరా !
సింధురగామినీనఖరచిహ్న విభూషణభూషితోజ్జ్వల
త్కంధర ! నీతినూతనయుగంధర ! బర్హిణబంధుకంధరా ! 146

క. ఖరనఖరశిఖరముఖరిత, వరరవవీణాప్రవీణ ! వాణీరమణీ
శ్వరనారదహారపారద, శరకీర్తివిహార ! కృష్ణసచివకుమారా ! 147

మాలిని. సులభనవమనోజా ! సూర్యసంకాశతేజా !
ఫలితహరిసుపూజా ! బంధుమందారభూజా !
కలితసుకవిభోజా ! కాంతసత్కాంతిరాజా !
లలితగుణసమాజా ! లక్ష్మమాంబాతనూజా ! 148

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ శృంగార కవిత్వవైభవ
వెలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకట
పతినామధేయ ప్రణీతంబైన రాధామాధవ
సంవాదం బను మహాప్రబంధంబునందుఁ

ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు

# రాధామాధవసంవాదము



## తృతీయాశ్వాసము

క. శ్రీకరవరవైభవని, త్యా! కమలానాథమృదుపదాంబుజభృత్యా!
శ్రీయాకారవిజితనాస, త్యా! కృష్ణాపత్య! రామదాసామాత్యా!

గీ. అవధరింపుము జనకధరాధిపతికి, మతిని సంతోష మొదవ సన్మానితిలకుఁ
దైవశుకయోగి రోమాంచితాంగుఁ డగుచు, నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె. 2

ఉ. అప్పుడు కృష్ణదేవుఁడు దయాంబుధి గావునఁ గావు మన్నచో
గుప్పున నాగజేంద్రుకడకుం జనుదెంచినరీతి వచ్చెఁ దా
నెప్పటిగొల్లపల్లెకుఁ గవీంద్రులు గాయకులుం సఖుల్ భటుల్
తప్పక వెంట రా రథము దారుకుఁ డింగిత మెంచి తోలఁగన్. 3

గీ. మునుపు తానున్నరీతులు మొదటికథలు, నక్కడక్కడ సఖులతో నాడుకొనుచుఁ
గనుమనట గొల్ల లెవ్వరో యనుచు బ్రమయు, నడచి కృష్ణుండు నందునినగ్గరు చేరి. 4

క. బడలితిరి మీర ; లిప్పుడు. విడిదిండ్లకుఁ బొండు ; మిమ్ము వెనుకఁ బిలిచెదన్ ;
దడసితిరి భోజనానికిఁ దడయక సేదలను దేరఁదగు మీరు వడిన్. 5

చ. అని పలుకుల్ వినంబడినయంతఁ బడంతులఁ జేనదల్చుచుం
గనుబొమ నిక్క నంబరముఁ గన్గొనుచుం జెవి వ్రాల్చి కొంతసే
పున కిటికి శౌరిపల్కుబడి పో వినఁగల్గెనె యంచుఁ దత్తరం
బున దమకంబుఁ దాల్మిభయము న్మదము న్మదిలోఁ బెనంగఁగన్.

క. బిరబిరను సెజ్జమీఁదికి, నరిగి గవాక్షములఁ జూచి హరియే యనుచుం
బరికింప రాధికామణి, మఱియేమియుఁ దోప కపుడు మ్రాన్పడియుండెన్. 7

వ. అంత. 8

సీ. వచ్చెనా నాతండ్రి వాసుదేవుం డని, నందుండు వచ్చె నానందమునను
నాచిన్నపాపని జూచితినా యని, సొంపున జేరె యశోద ప్రేమ

మననేస్తకాఁడు చేరెనటంచు గోపాలు, రుమిగూడి మూఁగిరి గొల్లలెల్ల
నేఁడైన దయకల్గెనే యంచు గోపిక, ల్వారిండ్లనుండి చూచిరి కడంగి

గీ. చెలఁగి కృష్ణుండు దుప్పటి మొలఁబిగించి, తల్లిదండ్రులపాదపద్మముల కెరఁగ
వారు దీవించి కౌఁగిటఁ గారవించి, రపుడు వారలభాగ్య మేమనినుతింప. 9

ఉ. నందకుమారుఁ డంత జిఱునవ్వు మొగంబున దేటకన్నులన్
బొందుగ జాఱుపూలసిగ పొంకమునన్ దల పగ్గలించు మై
గందపుబూతచే నలుపు గన్పడ కొక్కవిలాసమూర్తి విం
తందము మించినట్లు కనవయ్యె నెగాదిగ జూచువారికిన్. 10

మ. అచటం జల్లఁగ దల్లిదండ్రులమనం బానందముం జెంద బ
ల్కుచు గోపాలుర బుజ్జగించి నలుదిక్కుల్ జూచి తన్ జేరగో
రుచునున్నట్టి వ్రజాంగనామణులకోర్కుల్ జూపులన్ బ్రీతి జొ
న్పుచు వార్వారల నిండ్ల కంపి చనె గృష్ణుం డాఁగల్లోనికిన్. 11

గీ. చని యనుంగులతోడ భోజనము చేసి, తల్లిదండ్రులతో గొంతతడవు దాను
పెండ్లియాడినముచ్చటల్ ప్రేమనుడివి, వారియనుమతి నిద్రింపవలయు ననుచు 12

ఉ. ఇంపుఘటిల్ల నొక్కపడుకిల్లు గనుంగొని యందు రాధయం
దంపుటెలుంగు వీనులవినంబడ దా విననట్లు చేరి నున్
గెంపులచెక్కడంపుబనిగీల్కొనుబంగరుపావ లెక్కి ని
ద్దంపుమెఱుంగుజాయజముదాళికరంబున దల్పు మీటెనన్. 13

గీ. అమ్మ నేఁజెల్ల యదియెవ్వ రనగ రాధ, యెటకు బోవకు మిం దెవ్వఁ డేల వచ్చు
నేను నీయల్లుఁడనటంచు నెనరుబోప, బాదములమీద వ్రాలె గోపాలమూర్తి. 14

క. లేవయ్య దొడ్డవాఁడవు, నీ వని తా నవలి కేగి నిన్నేమనుచుం
దీవింప ; నిందు మునుపే, గోవిందుఁడు నిత్తెపెండ్లికొడు కన విందున్. 15

గీ. పాన్పుమీఁదను గూర్చుండె పలుకవయ్య, మీరలును మహారాజులైనారుగనుక
నే నమస్కృతి సేసెద నిదిగొ యనుచు, మ్రొక్కి తా బాన్పుదెసన నింపొనవసించి. 16

క. వెఱగుపడి యూరకుండెదు, హరిగూరిచి రాధ పలికె నానాఁటివలెను
మురిపము గలదో లేదో, యరయుదమని వచ్చినావె? యరయుము రాధన్. 17

ఉ. ఊరక యేమియున్ బలుకకుండెద వంచు దిటానున్నశృం
గారగుణావతంస! నిను గన్గొని యిన్నిక యూరకుండ దే
నో; రొకపెండ్లికైనను ననుం బిలిపించితె? చూడ నెవ్వరున్
లేరని కాదు ; నీదయకు నే దగుదాన్నను గాన వేడితిన్. 18

క. గోపాలక మాటాడక, కోపంబున నుండ నెంచుకొంటిని మొదలన్
నాప్రజ్ఞ నడవబోదని, కోపము నేనే శమించుకొంటిం బిదపన్. 19

ఉ. వేడుకకత్తె నంచు రతివింతల నిన్ భ్రమియింపజూతునో
మోడి వహింతునో భువనమోహిని నేనని కాక యేల పెం
డ్లాడితి వంచు బాధ్యతను నాడుదునో యిఁకయేమి యెందునుం
గూడనిదానవై చనవు గోరెద నెవ్వతె నంచు దూరెదన్. 20

ఉ. మానుమ మెంచిరైన నొకమంచితనానకునైన నీవు పు
ణ్యానకు మాటలాడెదవు ; నాతరమా నిను బల్మిజేసి నే
నానకుఁ బిల్వ ; నీఘనత చాలదె రాధకుఁ ; గాక కాఁకచే
నే నొకటాడనేటికి ; కది నీకు వసభ్యతఁ దోఁపనేటికిన్. 21

ఉ. దోసము కృష్ణ కృష్ణ నిను దూఱిన ; నానొసలందు ధాత మున్
వ్రాసినవ్రాఁత కాదనుచు వ్రాయఁగ నీవశమానె ; నీవు నే
వేసట లేక యేరికని వేడుకచేసెదు పైని పైని నా
నాసల మానమేమె పయినాడుచు నిన్నన నేరమున్నదే 22

చ. ఎడనెడఁ జూడుమంటివో ; పయిఁబయి నెమ్మది నిల్పుమంటివో ;
గడెగడెఁ గోరుమంటివో, పగింబడుమంటివో, వేఁగుమంటివో,
బడలుమటంటివో ; యరుచిపాల్పడమంటివో ; సిగ్గు నెగ్గు లే
కడలుమటంటివో ; పొరలుమంటివో ; మూర్ఛమునుంగుమంటివో. 23

ఉ. ఒక్కతెభ్రాంతిచేఁ బౌరల నొక్కఁడ మాన్పగఁ బూఁటకాఁపె? నే
నెక్కడిదాన నీవు మను పెక్కడివాఁడవు నాకు నీకు నే
మక్కరయున్నదైన నొక రాజెడిపల్కులు నేనె బల్కెదన్
గ్రుక్కక ; యాయెఁ బోయె నవి కొన్నిదినాల ఋణానుబంధముల్. 24

మ. మన మానాఁడు మహావినోదములఁ బ్రేమ ల్మీఱ భోగించుట
ల్వినుమీనాఁటికి నిద్ద ఱొక్కరొకరిన్ వేసారుటల్ వింతలై
కనుపించెన్ రచియింపనేరచి కవుల్ కల్పింప లోకానకున్
విననౌ ; నింతియచాలుఁ ; మీఁదికథ లీవీనుల్ వినన్ లేవిఁకన్. 25

ఉ. అందుకు బైసిమాలి యొకయత్నము చేసుకయుంటి నేని నా
యందుఁ బదాఱువేల కొకయంశము రాదు భవత్కటాక్షు ; మీ
సందున భోజకన్యకయు సత్యయుఁ దృప్తివహించినం గదా
యుందఱిమీఁద రాధ యిఁకనేటికిఁ జాలదె జీవనానికిన్. 26

మ. తుని నెట్లయ్యెదనో యిశేటికి విరక్తిల్ రేపు నీరుక్మిణీ
సుదతీరత్నము నీవు వాదుఁగొనఁ బొంచుల్ చేరి నే నల్కఁదీ
ర్చెదనో యెవ్వ రెఱుంగువారు మఱి నీచిన్నారిపూఁబోండ్ల నే
ర్పొదవంగాఁ గయిసేసి పెద్దతనమై యుండంగ నేఁ గందునో. 27

మ. సతమా పొత్తులవన్నెకాఁడని గణించన్ లేక యీగొల్లగు
బ్బెతలన్ బోరితి నేఁటిదాఁక ; నది చూపెన్ జూడు చేసేత ; నా
గతి నీపట్టపురాంద్రకై యొకతె వల్కన్ గారణం బున్నదే ?
యతిమాత్రం ; బెవ రేమిసేయ నిఁక మధ్యస్థుండవై తిన్నిటన్. 28

సీ. పాలువెన్నలకుఁ బైఁబడెడునాఁటికెకదా, యాదరించు యశోదమీఁదిప్రేమ
వేడుకతోడ ముద్దాడునాఁటికెకదా, మిక్కిలి నందునిమీఁదిప్రేమ
వ్రేపల్లె దూడల మేపునాఁటికెకదాఁ మేలమా గొల్లలమీఁదిప్రేమ,
అబ్బినయెడల మల్లాడునాఁటికెకదా, మిక్కిలి మాబోంట్లమీఁది ప్రేమ

గీ. తండ్రి వసుదేవుఁ డయ్యెను దల్లి యిపుడు, దేవకీదేవి యయ్యెను దేవరకును,
సఖులు నృపులైరి రాబోంట్లు సకియలైరి, చాలదే నేఁడు క్రొత్తసంసారమయ్యె. 29

మ. విమలాత్మా ! యొకవిన్నపంబు వినుమా వ్రేపల్లెలో నున్నపా
పమునన్ మానితొ నన్ను ; నేను మెలఁగేపాపాన వ్రేపల్లెపై
మమతల్ మానితొ, యింతమాత్రము వచింపన్ లేవె ; పుణ్యాంబు నీ
కమరున్ గారణకార్యముల్ దెలిసి యోగ్యాయోగ్యము ల్చూచెదన్.

ఉ. యేమిటికంటివేని విను మిక్కిడివారలు నాఁటినుండి నీ
వేమొ త్యజించి నాకొఱకె యీడకు రావని యాడుకొందు రా
సామి యెఱుంగు నీమనను జన్మముదాఁబ్చుటయాదిగాఁగ నా
నాముఖబాధలం బడితి నల్గురికిం బగవైతి నీవగన్. 31

చ. నిలువనిప్రేమదోసమున నెంజిలి నీకు వచింప ; నేరికిన్
దెలుపుదు నిందుకోసమె యతిత్వర రమ్మని కమ్మఁ బంపుటల్
పాలుపుగ నేఁటితో మనసులోఁ గలత్రొక్కుడు లెల్లఁ దీఱె ని
ర్మల మిఁకమీఁద నేమయిన మంచిది యంచిది సమ్మతించితిన్. 32

మ. ఇల నీమోహపుటాంద్రుడు నీవు పదివేలేండ్లున్ మహారాజువై
కలిమి న్బల్మిని జల్లనై బ్రతుకు డింక న్నన్ను నాపేరునుం
దలంపబోకు ; తలంప నేమిపని ? యాదైవంబు నీతోడనే
కలసెన్ ; బాసలు నీకు మేలొసఁగు బోకంజాతపత్రేక్షణా. 33

శా. దైవం బెంతకుదెచ్చె? నీవలపు లేదా నాఁటికి? న్నేఁటికిన్
ద్రోవల్ పుట్టెనె? నాఁటి దీగుణమె కాదో; నాఁటి విమ్మేను లే
కాదో? లేక యిదేమి; యీ వడత; లీకై లాట; లీమోసముల్;
నీ వాక్కృష్ణుఁడ నేను రాధనెకదా నీ రేజపత్త్రేక్షణా! 34

ఉ. ఇన్ని దినంబు లే బ్రతుకనెంచుట యేమిటి కంటివేని యీ
కన్నులదేమొ నిన్నుఁ దమకాంక్షఁ దీఱఁగఁ జూడఁగోరె; నే
నున్నది దేవుడుం దెలియకుండునె; దేవుఁడటందు నీకు లే
కున్నను మాఁకు బామరిక మున్నది యున్నదినాలలోపలన్. 35

ఉ. వంచన మాని గుట్టు మగవానికి నాఁడుది మించి యియ్యఁగా
దంచు వచింతు; రౌనది యదార్థము; మున్గల నిన్ను నొక్కటా
సించినదానఁ గాన నది చెప్పక తీఱదు; నేనుబడ్డపా
ట్లెంచఁగ రాధ దయ్యమనుమీ యిది యేమని చిత్తగించెదో. 36

సీ. ఒంటిగాఁ బవళింప నూరక నాగుండె, యదరంగ వెగవైచినట్లు తోఁచు
వడిలేచి తెగువతో నడవనూహించునో, నదుముచుఁ బైఁబడినట్లు తోఁచు
కాదని యటులేవ గమకింప వడఁకుచు, నదియేమొ కుదియించినట్లు తోఁచు
గోరంతయును గాఁ గూర్చుండఁదలఁచుచో, నట్టె సివంబాడినట్లు తోఁచు
గీ. వెఱ్ఱిపట్టినఁ గొంతవివేక ముండు, జలధిలోఁబడ్డ నొకతెప్ప గలిగియుండు
నింతగా దిక్కు దెసలేని యిట్టి వెతలు, నాతలనె పెట్టవలెనె యాధాతకైన. 37

మ. అడిగేవారొ; మనంబు చల్లఁగను మాటాడేటివారో; ప్రియం
పడ నూరార్చెడివారొ; మిక్కిలిదయన్ భాషించుచున్ బుద్ధిఁజె
ప్పెడివారో; ధృతిలేక యేడ్చుచు మొఱల్ వెట్టంగఁ గన్నీళ్ళు చేఁ
దుడిచేవారొ; యొకింత రేఁబగలు నాతో వేఁగువారో కడున్. 38

చ. నలువురునవ్వఁగా నడవినక్కశివంబయి పొర్లి యంతలో
మెలఁకువ నన్ను నే నుపశమించుక క్రుళ్ళుచు లోన మించినన్
దెలివిని దెచ్చుకొంచు నొకదిట్టతనాన దినాలు ద్రోసి యిం
తలరితి నిన్నుఁ జూచితి దురాసలు రోసితి మేలుచేసితిన్. 39

ఉ. ఓర్పున భాగ్య మింతెయని యూరక నీపలు కెంతుఁగాక యీ
నేర్పు లిఁకేమి యట్లుడవు నీవని నేనపు డెత్తి పెంచి యీ
డేర్పను, నేఁడు తాము రమియించి ముదించను, తమ్ముఁజూచి ని
ట్టూర్పులతో నిటుల్ కరఁగియుండఁగ నేనదియేల యింకిటన్. 40

శా. నామీఁదన్ దయ యుంచుమయ్య యనుచున్ మానంబుతో రాధికా
భామామరత్నము చెక్కు కేలనిడి గోపాలుం గనుంగొంచు వీ
ణామాధుర్యకలస్వనంబు దొలుకం దా నేడ్చెఁ గన్నీటనున్
గోముంజన్నులు దొప్పఁదోఁగి కడకన్ లో వెక్కుచున్ గ్రుక్కుచున్.

క. కాంతాళంబున రాధా, కాంతామణి రోదనంబు గావింప [illegible]
కాంతుఁడు గుణవంతుఁడు వర, కాంతనుఁ దపు దలుకఁ దీ[illegible]వని వడి లేవన్. 42

క. ముకుచెవు లదరఁగ గోపము, [illegible]మున కొకవింత దోఁప ముక్కుచు రాధా
ముకురాస్య రాక రాకని, మకరాంకునితండ్రి కనియె మటిమటి కినుకన్. 43

క. ఎనిమిదిరసములఁ గాంతల, నెనమండ్రను బెండ్లియాడి యిఁక నొకకొదువై
పెనుపొందుహాస్యరసమున, నను మచ్చిక సేయ వచ్చివాఁడవె కృష్ణా.

క. నాతోడిది నీకేటికి ; నాతో డిఁక బలుకరాదు ; నాతోడిసఖుల్
నీతికి జాతికి వెలిగా, జాతురు నీతోడిచెలిమిఁ జేసిన నన్నున్. 45

క. కడనుండి యాడవలసిన, యడియాసలమాటలెల్ల నాడుము నాపై
నిడవలసిన నేరం బిడు, గడిదేరితి నాఁటిరాధ గాదిఁక మెలఁగన్. 46

వ. అని సవతులపయిం బొడము[illegible] నునం బెరుఁగుకినుకచేత నొకటిసేయం జేతఁ
గాని వితంబున లేనికలంకలు [illegible]నంబునం దొలఁక తొందరపడి యెందునుం
ద్రోవగానని కొందలపాటున వెనుకముందఱతోఁచక యన్నియుం జేసి తటస్థుని
విధంబున నున్న సన్ని[illegible]నప్రియభావి వియోగానల్పకందర్ప హేతిఘాతంబుల
నిలువునం గృశించి కలితకంకణనయన [illegible]చు నప్పటప్పటికిఁ దలఁ ద్రిప్పనుఁ
దప్పక తనుఁజూచు నప్పడంతిఁ గటాక్షించి యించుకవిచారించి యిది యేమనియుం
బలంపక తెగించియున్నది యెందు నపనమ్మ కలం బడువారిమనంబు లొడంబడికలం
గాని [illegible]ర వని వినయావరసంభాషణంబుల షోడశసహస్రరాజకన్యకామనోహరుం
డిట్లనియె. 47

చ. పడఁతిరో [illegible]ఁడు నీకుఁ గలపాటివిచారము మాకు లేదె ; నీ
యడుగుల వ్రాలి కొంతప్రియమైనఁ దుద న్వివరింతు నన్నచో
దొడిబడ నానఁ బెట్టితివి ద్రోహము చేసినవాఁడ గాను నా
చిడిముడియెల్ల విన్నపము చేసెదఁ దాలిమి నూఁకొనన్వలెన్.

మ. మును బాల్యంబున నీవు ప్రోవనితతిన్ మోదంబుతో నున్నచో
వను నానావిధగండముల్ బొదువుచున్నన్ నీకటాక్షంబుచే

తనె కాదా కనవెళ్లఁగలేనది రాగా నాఁడు బాలెంతయుం
మను బండ్లంమను గాలియంచుఁ దరులంచుక్ మాయలం చందుమే.

క. వెనుకక్ దెలిసెను కంసుని, పను పని యది తెలియలేక బలి యని బిలువక్
జనవలసె మధురకవ్వల, వినుమందువె మాను యచట విడివడినకథల్.

సీ. త్వద్దంద్రు లయ్యుఁ దారు గాకుండిరి, చెరలఁ దగిలి వెడలఁ దెరువులేక
వనుఁదలంచు దేవకిని వసుదేవుని, నరయవలదె దోషమా లతాంగి

ఉ. కట్టిడి కేఁతలు స్వైతలుఁ గంసునితోడనె దీరెనంచు నే
గుట్టువహించి రాజ్యమునకుక్ బరు వానక వానితండ్రికిం
బట్టముఁగట్టి యాకుదురుపాటవునంతను నిల్చి యం ను
న్నట్టుల నిన్నుఁ జూడవలెనంచుఁ దలంచుక పైనమానెదక్. 52

మ. సకియా! కంసునిఁ జంపినామని జరాసంధుండు రోసాన నూ
రక మామీదఁ జలంబుతో దిగి యహోరాత్రంబులున్ గోటఁ జు
ట్టుక పోరాడు బలంబుతో మరలి పోటుంబంట్లతో డుల్లు నా
బకళాటానకుఁగాదె యీనడుమ నేఁ బార్వాటి డాఁగుండితిక్. 53

క. ఈడకువచ్చినఁ గాదని, యాడకునుంబోక మనము హాయిగ నెచటన్
కూడానుండుదుమో యని, వేడుకను సముద్రు నడిగి విను నేర్పమియిక్.

గీ. వనధినడుమను ద్వారక యనగ నొక్క, పురముఁ గల్పించి యందు గాపురము గాఁగ
నచటివారల రప్పించి యచటి కేను, బైనమెయుంటి నింతలోపల నె వినుము. 55

శా. వాండ్లు న్వీండ్లు నునుక్ బడంతి యనుచుక్ వాత్రవ్వఁగా వించు దా
విండ్లమ్ముల్ శిశుపాలుఁ డందుకొని శీవిం కైకొనం దోడ వి
ల్కాండ్ల న్వాని జయించి రుక్మిణి నటుల్ వంశాభిమానంబుకై
పెండ్లాడన్వలెనెం బయోజముఖి దప్పేనిక్ శమింపందగుక్. 56

చ. ఇవతల నొక్క రాజు తనయింట [illegible] రత్నము [illegible]యెనంచు నా
యవుదల నింద మోపఁ బరిహారముగా నొకజాడ వెంబడిన్
దవుల వనాంతరంబునను నన్నని మెచ్చి పురాణబుక్షపుం
గవుఁ డగు రామదాను తనకన్యను రత్నము నిచ్చె బల్మిచేక, 57

క. అపు డారత్నముఁ దొలుతటి నృపునకు నిచ్చినఁ గుమారి నిచ్చె నతండున్
జపలాక్షి నిందసోకిన, యపకీర్తికి వారిఁ బెండ్లియాడఁగవలసెక్. 58

గీ. గడచువారల నొక్కొక్క కారణాన, వటు బ్రతిమ్మసుఁగాఁ బెండ్లియాడవలసె
నొకటి సేయంగఁబోయిన నొకటివచ్చు, నెదుటివారు వివేకులై యెఱుఁగవలయు.

మ. చెఱలోనం బడువారు లేరొ? దయచేసేవారలు న్లేరొ? కా
తరలంచు న్విడిపించఁబోయిన నదే తప్పే? పదా లు రా
తెనవల్లా మెడఁ జుట్టుకోవలెనె యాదీనత్వముం జూడకే
మఱుమాటాడఁ దెగింతు; రేమని వచింపన్ లేక పెండ్లాడితిన్. 60

క. ఈలాగున నొక్కొక్కతెఁ, జీలలువలె దగులుకొనఁగఁ జేసెను దైవం
బేలా యొదలెఱుఁగనిశిశ, మేలోకమునందుఁ గలదె యిది నిజమానే.

మ. ఇదిగో చేసినపాప మీపలుకులం దేమాత్రముం దప్పివం
బదివే లేల భవత్పదంబులు దలంపన్ యోగ్యుఁడం గాను సం
పదతోడన్ బలగంబుతోఁ బ్రతిభతో భాగ్యంబుతో నున్న నీ
మది కింపౌనని నీప్రతిష్ఠయని కొమ్మా నమ్మితి న్నెమ్మదిన్. 62

ఉ. ఏనటుగాకవారలపయిన్ దయగ్గొనవాఁడనైన నో
మానిని! నిన్ను నింత బతిమాలు నే సమయంబుఁ జూచి యే
మేనియుఁ బల్కఁగాని దయ నింతటిమోహము నీకుగల్గినన్
మానక నాదువెంబడిని మచ్చిక ర మ్మికఁ యుక్తులేటికిన్.

ఉ. అన్నియు నిందు నాకుఁగలయట్ల పదాఅవపాలు మేలు నీ
కున్నదె? నీకుఁదాఁ దెలియదో? యవివేకపుఁజేఁత నూరు లే
కున్నది గాన నిన్నులుక నోడెద? లోకమువా రెఱుంగ రే
కన్నుల కల్కి నీవు దయగల్గుట నే దయగల్గియుండుటల్. 64

క. అదియేల యాఁడుదానికిఁ, గొదవ లిడన్ రాదు గానఁ గొదువగు నేనే
యదయుఁడ మహాపరాధిని; మదవతి యిఁకనైన మోడి మానఁగరాదే. 65

మ. అనిపల్కన్విన లేక రాధిక సరోజాక్షు న్నిరీక్షించి క్ర
మ్మినవిట్టూర్పు లడంచి గద్గదిక నేమే నాడఁగాఁబోయి యే
లని తానె తలయూఁచి యోయి, విను కృష్ణా! జాణవం చందు రే
మునా గల్పించుచు నేఁ దెటింగితిమి సొంపుల్ గుల్కునీపల్కులన్

క. వేవిధముల నీమోహపు దేవులకథ కథలుగాఁగఁ దెలిపెద వౌఁగా
నేవిసవలె నను బ్రజ్ఞకొ, నీవేడుకొ కాక యేమి నేరుపు చెపుమా. 67

క. నిన్నెవ్వ రడిగి రీకథ, లిన్నియు ; నిన్నెవరు కొదువ లిటు లాడిరి, మా
కున్నవి దయ లని యెవ రిను, కున్నా ; రీటక్కు లేల ; నోయి మహాత్మా. 68

చ. వెడవిలుకాని చేఁ దనువు వేసరియున్నది ; యందుమీఁద నీ
యుడుకులమాట లేమిటికి నూరక యాడెదు నేర్తునంచు ; ముక్
బిడుగునఁబడ్డవారి కొరకఁ గొని [illegible] దురు [illegible] తావితల్
విడు విడు చాలు నెంతయవివేకము నేఁ డిటులయ్యె వేడుకల్. 69

గీ. మమ్ము హాస్యంబులాడక మానవేని, నాడవలసినయటులెల్ల నాడు మీవు
నేను విని తాళలే నని ఖేదమునను, జెవుల నంగుళులను జొన్పి శిరము వంప. 70

చ. ఇది కదియంగ వేళ యని కృష్ణుఁడు పానుపు డిగ్గి రాధికా
మదవతిచెంతఁ జేరి నును మై పులకించి చెమర్చ నొక్క కే
లుదుటునఁ దీసి కన్నుఁగవ నొత్తుక నాలి కోపమున్న మం
చిది చలమేల నొక్క చెవిచే విను నా దొకవిన్నపం బనన్. 71

క. ఒక చెవి మూసుక విన్నప, మొక చెవి విను మనినమాట కుల్లములోనన్
ముకురాస్య వాదులాడక, మొక మోరఁగఁ జేసి కొంత మోడి వహించెన్. 72

ఉ. ఇప్పటి కింతె చాలునని యేమియునున్ బెనఁగాడఁ[illegible]క యా
కప్పురగందితో ననియెఁ గంజదళాక్షుఁడు కోపగించి యో
యొప్పులకుప్ప నీ విటుల నుందువె యుండిన నుండు మోముటుల్
ద్రిప్పఁగ నేమిచేసితిని దిన్నఁగఁ గన్నులు విచ్చి చూడవే. 73

క. నీమనసు రాకయుండిన, మోమైనం జూపరాదె మోసంబటవే
మామిళ్ల కాజ్ఞలె తే, కామిని గుక్కిళ్ల కాజ్ఞ గలదే యెందున్. 74

ఉ. కోమలి లోకమందు నొకకొన్నిదినాలకుఁ గాదె కామినుల్
కాముకులందు నిల్పుదురు కాంక్షలు పిన్నటనాఁటనుండియున్
గోమున నెత్తి పెంచితివి కోరిక లుంచితి వాదరించి నే
మేము యెఱుంగఁ జేసి తిపు డెవ్వఁడ నింతనిరాకరింపఁగన్. 75

చ. ఎఱుఁగనివాని నన్నుఁ జెలి మేటికిఁ జేసితి వాసఁగొల్పి నీ
సరసము నీవిలాసమును చాల మనంబున నాఁటె నిన్నిఁకన్
మఱవఁగఁజాల నేల బతిమాలఁగఁ జేసెద వేమిపోయె ని
న్నరగడె నేపు కూడిన కృతార్థుఁడ నాదుఁగదే తలోదరీ. 76

మ. కలలోనైనను నీవె దైవమని నేఁ గన్గొందు నా డెందముం
దెలియన్నేర్తువు దైవయత్నమున నెంతే నేరముల్ చేసినన్
జాలుకం జూతురె ; బుద్ధిగా నడువుమంచుం దిద్దుకో రాదఁటే ;
చెలి ! నీచిత్తము నాదుభాగ్య మిఁక నాజీవంబు రక్షింపవే. 77

చ. కనికర ముంచవో, నెనరుగన్నదానవు కావొ ; భేద మీ
తనువులతోడ రాదనినదానవు గావొ ; పడంతి యింతలో
మనలను జూడలేక నడుమంత్రపువారు గుబారుచేసి గొ
బ్బున నినువంటివాని కెగఁబోసిరి నాతలపొప్పకుండఁగన్. 78

చ. చిలుకలకొల్కి నీసొబగుచిన్నెల నీనును దేటపల్కులన్
వెలసె మనంబు కొంత, రతివేడుకలన్ జవిచూపి తేనియున్
బలుకులకేమి నాతనువు పావనమా ; నటమీఁదిమాటకున్
ములుచనుగాను నీమనసుముచ్చటఁ దీర్చెద నోతలోదరీ. 79

క. అహమికను నన్నుదూటిన, తహతహచే నపుడు నీకు దయలేదనుచున్
బహువిధముల నెదురాడితి, నహహా నాయంతవెతల నందవె నీవున్. 80

ఉ. కంతునిగంతు లెంచి కమగంటికిఁ బుట్టెఁడు నీరునించి యం
తంతకుఁ దల్లడించి ధృతి యల్లలనాడఁగ నిచ్చగించి యా
ద్యంతములెల్లఁ దలంచి చెలులాడుకొనన్ దలవాంచి వాంఛచే
నెంతవిరాళిఁ బొందితివొ యెంతకృశించితివో తలోదరీ ! 81

చ. చెలి నినుఁబాసి యే నిదురఁజెందమి కప్పు లెఱుంగుఁ గాఁక చేఁ
దలఁగుట మేనెఱుంగు రుచిదప్పుట జిహ్వయెఱుంగ నొంటి నే
నిలుచుట నీవెఱుంగుదువు నిన్నును నీమదిలోనిచింతయున్
దలఁచిన గుండెలోదిగులు దైవమెఱుంగును బ్రాణనాయికా. 82

చ. నలువురిమాటలున్ వినక నాతలిదండ్రుల నమ్మఁబోక పె
ద్దలు తెలుపంగ నూఁకొనక దైవమునుం గొలువంగలేక నీ
చెలిమియె భుక్తి ముక్తి యని చేరితి నింతటిదానవౌట నేఁ
దెలియక మోసపోతిఁ బరదేశినిఁ జేసితి వంగనామణీ. 83

క. ఈపగను వగకు వగకును, భావనతో నూఱుపద్యములు చెలి నీకై
యీవఱకును రచియించితి ;. నీవేగతి ; లోకమెల్ల నినుఁగొనియాడున్

ఉ. జిత్తులకత్తె లిచ్చకముఁ జేయుచుఁ బైపయి నాసఁగొల్ప నే
నత్తఱి నన్నియు న్మఱచి యంతకుఁ జొచ్చితి ; బొంకనేర ; వా
దత్తిఁక నీవు నేవగను దండనఁజేసినఁ జేయఁజెల్లు ; నీ
చిత్తము నాదుభాగ్య మిఁకఁ జెప్పెడిదేమి కురంగలోచనా. 85

ఉ. ద్రోహి నటంచు నేఁడుగద తోఁచెను ; ముందటి చిన్ననాఁటి నా
మోహముఁజూచియైన నను ముందుగఁ గైకొనరాదె. కోప మే
లే హరిణాక్షి ! నానడత లేగతినుండిన నుండెఁగాక ; యీ
దేహము నీయధీన ; మిదియెంచియుఁ గౌఁగిటఁ జేర్పరాదఁటే. 86

సీ. ననచూపక ఫలించు పనసభూజముభంగి, సుదతిరో ! మును మేలుం జూపినావు
పూచినంతనె కాచి పోల్చుమామిడిమాడ్కి, నెలఁతరో ! మది దయ నిలిపినావు
పూచి పిమ్మట రాలిపోవుపాటలిలీలఁ, దరుణిరో ! కలప్రేమ దాఁచినావు
పూచి కాచి ఫలించు భూకల్పకమురీతి, మగువరో ! యిఁకనైన మనుపఁగలవు

గీ. నీకు నీయంతఁదోఁపని నెనరు ప్రేమ, బలుకువగలను నడతలఁ దెలుపవశమె
నిన్నువంటిది నను వంటి నెవరువానిఁ; జలము సేయుట యిది పూర్వఫలము గాదె.

క. కలికీ ! పలుకవె ; చిలుకల, కొలికీ ! దయఁ జూడరాదె ; కోపం బేలే ?
యలికీరంబుల కిదిగో, యల్లికొను నాడెంద మెందు కలయించెదవే.

గీ. ఆన విడు నీదుపదములనైన వ్రాలి, వేడుకొనెఁ యెద దయపుట్ట విన్నవించి
పడతి కాదేని హృదయతాపంబు దీఱ, నాన విడువుము నీయధరామృతంబు.

గీ. రమణి దాసరితప్పు దండమునఁ బోవు
నందు రందుకు నోఁచనై తిందువదన !
యింక దయనేలుదో భాగ్య మింతో యనుచుఁ
దొలుతఁ దను దోడితెచ్చినచిలుకఁ జూచి

చ. కడకడయుండెదేమె చిలుకా ! మును నమ్మిక లీవొసంగఁగాఁ
దొడిఁబడి నమ్మి వచ్చితిని దోచినరీతిని విన్నవించితిన్
గడపట నేమిలేక ననుఁ గంతుని చేతికి నప్పగించె మీ
పడఁతుక, యౌను గా దనుచుఁ బల్కదు ; నీవును నూరకుండెదే ?

. చిలుకలకొలికికిఁ గలికికి, నలుకఁట పలుకదఁట చలములఁట నీవైన
గులుకువగఁ గులుకుకపురపు, బలుకలొలుక వలపుఁ జిలుకఁ దలుకవె చిలుకా !

గీ. మరుఁడు గుఱిగాఁగ నేనాడుమాట యొకటి
చెవులఁ జొరదాయె చిలుక యీ చెలికి నేఁడు
నూఁదత్రిప్పంగ దారంబు నూఱవదు
భామ యిటులున్న మగవాఁడిఁ కేమిసేయు. 93

వ. అనిన రాధికాతిలకంబు తనపెంపుడుచిలుకం జేర్కొని యిట్లనియె. 94

క. నే నెవ్వతెఁ దను మనుపను, దా నెవ్వఁడు నన్ను వేఁడఁ దనకు న్నాకున్
బూనిక నేసంబంధమొ, వైనము నీ వడుగ వేరవా యని గదుమున్.

వ. చిలుక యిట్లనియె.

క. నీ వనఁగా నతఁ డనఁగా, నే వినగా జాల ; నెల్లనీతులుం గీతుల్
నీ వెఱుఁగు దాత డెఱుఁగు, బోవే యనఁ గృష్ణు డలుక మొగమునఁ దొలఁకన్.

గీ. ఇంత పనిలేనిపనికి నే నేల పెనగ, ననుచు మెడజాఱుసిగఁ గేల నదుముకొనుచుఁ
దగటుదుప్పటి వ్ర్రేఁగాటుగ ఘటించి లేచి తలయూఁచి రాధను జూచి పలికె.

ఉ. తీరనిమోహతాపమున దీనతచే బతిమాలిచూచి నే
సారితి నింక నీచెలిమి చాలును నీవెత నీకు ముద్దె ; నే
నూరికిఁ బోయెదం గరుణ యుంచవె యుంచుచు యూఱడింపగా
నేరకపోతి నంచుఁ జెలి నీవెత లెంచెద విం మీఁదటన్.

చ. సొలయక యెన్నిదేశములు చూచితి నెందఱతోడ నేస్తముల్
వలిపితి నెంతముచ్చటకుఁ జాలితి ; నెవ్వియు నిల్వవాయె నీ
నిలుకడమాట నీనెనరు నీరసికత్వముఁ జాల నమ్మితిన్
జెలి ! కలనైన నన్ను మఱచేవుసుమీ యెవ రెన్ని చెప్పినన్. 100

చ. కులుకుమిటారి నీవు నెలకొన్నపురంబును నీగృహంబు నీ
చెలులును నీవు నీసొలపుఁజిన్నెలు నీవగలున్ మనంబునన్
నెలకొన గుండె జల్లుమను నేఁటికిఁ దీఱని పైనమాయె ముం
గల నినుఁ జూడనౌనె ! యవుఁగా పరదేసుల కేడవేడుకల్

ఉ. ఒక్కొక్కనాఁటిసీనదశ లుల్లమునం దలపోసి యే
చిక్కులకైన నోర్చి దరిఁ జేరుదుఁగా యని చాల నమ్మితిన్
మక్కువలేనిచోట బతిమాలిన నామది కందుఁ ; గాక యా
తక్కువనేస్తమైన మితిదప్పిన వేసట గాదె యేరికిన్.

చ. పకపకనవ్వుచుం జెలఁగి పైకొనుచున్ రతులం బెనంగి పా
యక మనమున్న చంద మిసుమంతయు నే మఱవంగఁజాల ; నెం
దునుఁ బలుమాట ; లీతనువుతో నెఱనమ్మిన నామనంబుతో
నిఁక నొకకాంతతోఁ జెలిమి యేమన సేయఁగలాఁడ మానినీ ! 103

చ. పలుమరు నీకుఁ గాఁబడినపాటులు నీమనసే యెఱుంగు ; నీ
చలమును నీతృణీకృతియు జవ్వని నామనసే యెఱుంగు ; న
వ్వల నను వంటిమేలుంగలవాని గడించుకొనంగ లేవు ; నా
వలనను దూఱు లేదు ; సెలవా యిఁక నీమకు ముద్దుగోమలీ

మ. పరుపై వచ్చితిఁగాని నేరములు నాపైనుంచి కోపింతు వే
నెఱుఁగ న్నామది చల్లఁజేసితివి యీ యిల్లేల ? యీయూరేల ? యె
వ్వరు నాకేల ? ఋణానుబంధములు గావా యన్నియు న్నేఁటితో
సరి గాఁబోలును బోయివచ్చెదఁ గటాక్షంబుంచుమీ రాధికా.

మ. అని పల్కన్ విని కల్కి యింతపలుకయ్యా యింత గా నేరపం
డిన లోచేతువె రాజకన్యకల ; నెంతేఁ జాలఁ బెల్లెల్లఁ బా
లనుచు న్నెమ్మెడిగొల్లవారికడ ; నాహా నేము నీచేతులన్
గనినా ; మన్నియు నీకటాక్షముననే కాదా ప్రవర్తించుటల్. 106

మ. నను నేఁ డెవ్వతెనంచుఁ జూచెదవు కృష్ణా నిన్నుఁ బోకుండ బ
ల్మిని బ్రార్థించెదనంచు నెంచితివొ యకాలే యంతకుం జాలవే
యనుఁగుంబోటులయిండ్లకేఁగెదవొ భాగ్యంబాయెఁ బోపొమ్ము ప్రే
మను నేఁ జూచెద నిన్ను నన్నుఁ దెగడే మాయూరిపూఁబోఁడులన్.

చ. తెగువల నమ్మలక్కలుం బతివ్రతలై నను దూఱువారు ; నే
నోగి వినుదాన ; నీవు కడనుండెడివాఁడవె ; నీవు వారునుం
దగవున మెచ్చ సేయుదును ; దప్పినఁ జూచెద ; నింటికెల్లనుం
బోగడికఁ దెత్తుగాదె ; యెటుపోయెదు నిన్విడ నెన్నిభంగులన్. 108

చ. అనుచు బిరాన లేచి వనజాక్షునిదుప్పటికొంగుఁ బట్టి గొ
బ్బున నెటుపారిపోయెదవు పోదువుగా కని శయ్యమీఁదికిన్
బెనఁగుచుఁ దీయ నొయ్యనఁ దమిన్ బిగికౌఁగిటిలోఁ గదించి రా
ధను గరఁగించె శౌరి తనుతాపము దీఱఁగఁ గోప మాఱగన్. 10

చ చలమును గోప మీరసము జవ్వని కేడకు డాఁగిపోయెనో
తెలియదు కొంతసేపు తనదేహము తా నెఱుఁగంగలేక మై

పులకల నప్పటప్పటికిఁ బొంగుచు నిక్కువలంట సోలుచున్
బలుకక యూరకుండె నలమాధవుకౌఁగిట రాధ వేడుకన్. 110

క. చెలువయఁట రాధ ; కృష్ణుఁడు, చెలువుండఁట ; చిన్ననాఁటి చెలిమఁట ; యెకలై
కలసినవారఁట ; వారల, మెలకువలకుఁ దమికి మట్టుమేరలు గలవే. 111

మ. కొమరుంబ్రాయపుఁజిన్నిచన్నుఁగవ ముకు[illegible] నొక్కి కోరాడి కం
ఠమునం గేలు గదించి యిక్కువలు గోటన్ మీటి నెమ్మేన లేఁ
జెమటల్ గ్రాలఁగఁ గౌఁగిలించి బడలించెన్ జొక్కి తా నెంతయున్
దమి రాధామధురాధరాధరసుధాధారల్ చవిం గ్రోలుచున్. 112

ఉ. చిక్కితి వంచు రాధ యొకచే హరికంఠము గౌఁగిలించి తా
నక్కున వ్రాలి చూడకుమటంచును నించుక మోడిసేయుచుం
జక్కరయోవి యాని నిలజాలక కన్నరమోడ్చి సోలుచుం
బుక్కిటివీడె మందుకొని ముద్దుల నొద్దిక మాటలాడుచున్. 113

## నిరోష్ఠ్యమత్తేభవృత్తము.

గిలిగింత న్నగి కాంత కాంతకృతసంకేతజ్ఞయై యిచ్చఁ జం
చలతాటంకరథాంగగండయుగయై సత్యంక్తచేలాంతయై
చెలరేఁగెన్ గఠినస్తనాగ్రనఖనిశ్శేషాధరగ్రాహియై
గళనాదాంగదఘంటికాకలకలాక్రాంతాంగజేచ్ఛారతిన్. 114

చ. గళరవ ముప్పతిల్ల బిగికౌఁగిటఁ జన్ను[illegible] పిక్కటిల్ల నం
దెలరవ మావహిల్ల గడిదేరినవార్తలు గ్రక్కతిల్ల మే
ఖలరొద తారసిల్లఁ దెలికన్గొన లించుక సొమ్మసిల్ల నూ
ర్పులు వడిసంఘటిల్లఁ దమిఁ బొంగి లతాంగి చెలంగి పైకొనెన్. 115

ఉ. అంత రతాంతమందుఁ గమలాక్షుఁడు రాధిక మోముఁ జూచి యో
వింత లిఁకేమి తెల్ప నొకవేడుకలోఁ బదివేలు వేడ్కలం
తంత ఘటింపనేర్చితి వహో నెఱయోధవు గాదె నీవు నీ
వింతను నేరకున్న బ్రమియింతువె కృష్ణుని లోకులెన్నఁగన్. 116

ఉ. కోమలి యెంత నీవుపయికొన్నను మున్నొక లేనియెమ్మెతో
నామికచేత నే రతులయందు మెఱుంగక యొల్లనంటి నేఁ
డేమని విన్నవింతుఁ దనువెల్లను బావనమాయె నీబుణం
బేమిటఁ దీర్చుకొందు సొలయించితి వన్నిట నన్ను వేడుకన్. 117

క. అన విని రాధిక కృష్ణునిఁ, గనుఁగొని యానవ్వుమోము కళగలచెక్కుల్
నునుమోవియుఁ దెలిగన్నులు, గొనబునఁ బలుమారు ముద్దుగొనుచు న్నగుచున్. 118

ఉ. తేరనినిద్రమంపు దగదీఱనియూర్పులపెంపు పచ్చికా
టూఱనిమోవికెంపు చెమటూఱనిచెక్కులసొంపు జాఱియుఁ
జాఱనిపైఁటలోనిబిగిచన్నులక్రొన్నెలవంకగుంపు చె
న్నార నొయారముల్ గులుక నచ్చెలి యప్పడకిల్లు వెల్వడన్ 119

క. అనడత నెఱిఁగి యెఱుఁగని, దానివలెనె యాయశోద తా నుండఁ దనుం
దానయి నందుం డడిగినఁ, బోనీ మంకేమి యనుచుఁ బొలఁతుక నవ్వెన్, 120

క. ఈరీతిఁ గొన్నిదినములు, కూరిమితో రాధ వగలకున్ లోనై యా
శౌరి వసియించి యొకనాఁ, డారమణిన్ సమ్మతిల్ల నాడి సుముఖుఁడై. 121

గీ. పదిదినములకు మఱలివచ్చెదనటంచుఁ, దల్లిదండ్రులతోఁ దెల్పి యెల్లచెలులఁ
బూర్వసఖులను బ్రియమున బుజ్జగించి, రాధతోఁగూడ వెడలె నమ్మాధవుండు. 122

చ. రథముపయి న్వసించి కవిరాజులు రాజులు నేస్తకాండ్రు వే
విధముల వెంటరా నమితవేగముతో నతివైభవంబుతో
నధికముదంబుతోఁ దలఁచినప్పుడె ద్వారక కేఁగుదెంచె దన్
రథగజవాజివీరభటనాథు లెదుర్కొనఁగా మహోన్నతిన్. 123

ఉ. ఇట్లు పురంబుఁ జేరునెడ నేమని తెల్పుదుఁ దోరణాలమే
ల్కట్లను మంచెలన్ బురుజుల న్వాడితేరులఁ జప్పరాలయ
ర్కట్ల జవాదివాసనలు ఘుమ్మన బంగరుమెడలన్ జెలుల్
పాట్లముగా సుమంబులను బోయఁగ నబ్బుర మయ్యె రాధకున్. 124

మ. హరిఁ జూడన్ బురమెల్ల ఘల్లుమనె; నాహో రాధ మాకేడ దా
పురమై వచ్చెనటంచు రుక్మిణి మొదల్ పూఁబోఁడు లేమేమొ యెం
చిరి; శ్రీకృష్ణుఁడు పూర్వపక్షములఁ దా సిద్ధాంతముల్ చేయు నే
ర్పరిగానన్ సరిమిద్దెలోన నిడెఁ బూర్వస్నేహయౌ రాధికన్. 125

మ. పయిపై రుక్మిణిసత్యభామల రమింపంగాఁ బదార్వేలుక
న్నియలం గూడఁగ నిర్వికారుఁ డనిన న్నిర్మోహియౌ నిర్జితేం
ద్రియుఁ డౌనన్నను దాళియుండె వెనుక; న్నిక్కంబుగా రాధపై
దయవాఁడై యపుడున్న చిన్నెలు వృథాతత్త్వంబు లయ్యెం గడున్.

ఉ. చేకొని మంత్రులం గడిరియె సీమవిచక్షత ; కార్యఖడ్గము
ల్వీకఁ గుమాళ్లయం గడియె ; విద్యలఁ బెద్దతనంబులన్ గుల
స్త్రీకులశకంబులం దడియెఁ ; జిన్నె లిఁ కేమన రాధతోడిదే
లోకము గాఁగ నుండె నిఁక లోసలు కాముకుఁ డంచు నెంచరే.

చ. కవ విడలేక జక్కవలకైవడి రాధయు మాధవుం డిటుల్
దవులుకయుండఁ గాఁ దమరు తాళక రుక్మిణి సత్యభామ జాం
బవతియు మిత్రవిందయును భద్ర సుదంత కళిందజాతయున్
రవరవ నాడుకొంచు నొకరాతిరి లక్ష్మణయింటి కేఁగినన్. 128

చ. పడఁతుక మ్రొక్కి వారికి సపర్యలు సేయుచుఁ దాను వారు నొ
క్కెడ వసియించి నెచ్చెలుల నెవ్వరి నుండఁగనీక యోజనల్
నడపుచు నీసునం బెగుచ నల్వురు నాలుగుమాటలాడఁగా
నుడుకుచు సత్యభామ విఃయోక్తుల రుక్మిణితోడ నిట్లనెన్. 129

గీ. నన్ను గయ్యాళి యందు రీకన్నెలెల్లఁ, దెలియవినవక్క పట్టపుదేవి వీవు
ప్రేమ నీతోడిసాటిగాఁ బెనఁగఁజెనె, దానవారాతి పారిజాతంబుకొఱకు. 130

ఉ. ఎన్నఁటికైన వానిచను వెవ్వతె నమ్మనె కృష్ణ కృష్ణ యా
యున్నదినాలలోన దయయుంచినవానిపితానఁ బెద్దకున్
బిన్నకుఁ గాకయుండ నడపించును ; చేసెడిబాసలంటిమా
యెన్న వశంబుగాదు నిజ మించుక లేదు తలంచిచూచినన్. 131

ఉ. ఇంచుక రాధనుద్ది మును పే విని వేఁడితి ; వారు వీరుఁ గ
ల్పించిరటంచు నో రదిమి లేదని బొంకెను నాఁడు ; నాఁడె యి
ట్లించుక యొద్దికైన మన మింతకు రా నడపింతుమే యిఁకం
గొంచెములోనె దానిపయిఁ గూరిమి తప్పునె ? తప్పె యోజనల్.

వ. అనిన జాంబవతి సత్యభామ కిట్లనియె. 133

ఉ. ఎందుకుఁ దప్పె యోజనలు కృష్ణునితంట లెఱింగి దానిపై
నిందఘటింప నేమగును నేఁడవుఁ గా దనువారు లేరు గా
కందఱుఁ గారటంచు నిపు డక్కట రాధిక మేలుగల్గెనా
యందె రమింపఁగావలె నహర్నిశముం బనియేమి యేరికిన్. 134

వ. అనిన మిత్రవింద జాంబవతితో నిట్లనియె. 135

ఉ. ఎవ్వరికిం బనేమి యని యేటికిఁ బల్కెదు నాఁడు నీవు నే
మెవ్వరమంచు నుల్కితి; మొకించుక నేర్పుల నాటపాటల
న్నవ్వుల లోనుజేయవలె నాఁటికి నాఁటికి గాక రచ్చలన్
రవ్వలఁ బెట్టినన్ మనసు రంజిలనేర్చునె యెట్టివారికిన్. 136

వ. అనిన భద్ర మిత్రవిందతో నిట్లనియె. 137

ఉ. రచ్చల రవ్వలన్ మనసు రంజిలదంటివి; రాధ కేమిట
వ్వచ్చెఁ బ్రతిష్ఠ నేఁడు; మగువా మనమందఱ మొక్కమాటగాఁ
గచ్చెగ శౌరితోడఁ బలుకన్వలె రాధకు మాకుఁ గూడునే
యిచ్చలు మేము గావలెనొ నీ కది కావలెనో యటంచిఁకన్. 138

వ. అనిన సుదంత భద్రతో నిట్లనియె. 139

చ. అదివలె మేముగావలెనొ యంచిపు డాడిన దాని మానునే;
యదివలె మీరుఁ గావలె నటంచను; నింకొక నేర్పు దెల్పెదన్;
పదటము లేక నందఱముఁ బద్మదళాక్షునితోడఁ బోక నేఁ
డిదిమొదలున్ దెగించినవహిన్ సమయంబు ఘటింపఁగావలెన్. 140

వ. అనినఁ గాళింది సుదంతతో నిట్లనియె. 141

చ. సమయము సేయఁ గృష్ణునకు సాగకపోయిన దేమి; యందుచే
నమరఁగ రాధ కేమికొదువయ్యెను; బిన్నటనాఁటనుండియున్
దమి తలకెక్కియున్న దయదప్పునె నేర్చితిమేని మందుమం
త్రములను బూని వానికిని దానికి భేదము సేయఁగాఁదగున్. 142

వ. అనిన లక్షణ కాళిందితో నిట్లనియె.

ఉ. మందును మంత్రమంచనెదు మంత్రము లిప్పుడు పాటిఁదప్పె; నీ
యందఱు మెచ్చ నే నొకయుపాయముఁ దెల్పెద రాధచెంతకే
పొందుగఁ జెప్పిపంపుదము "బుద్ధిని బెద్దవు నీవు, నీకు మా
కెందుకు వాదు నీవె తగ నెంచుక దిట్టము సేయు" మంచొగిన్. 143

వ. అనిన రుక్మిణీరమణీశిరోమణియక్కామినీమణులం గనుంగొని నవ్వుచు నిట్లనియె. 144

ఉ. నిందలు సేయ నెందుకుఁ దృణీకృతి యెందుకు మించనాడఁగా
నెందుకుఁ గాదు కూడ దన నెందుకు మోడివహించి యుండఁగా
నెందుకు మందు మంత్ర మన నెందుకు దైన్యముతోడ వేఁడుకో
నెందుకు సేవచింతు నొకయిక్కువ యించుక విందురేనియున్. 145

మ. మనోభోగంబుల నేమితక్కువలుగా మన్నించె నేవేళకై
నను మాటాడఁడో బుజ్జగింపఁడో రతిన్ మల్లాడుచుం దృప్తిగాఁ
దనువుల్ సౌఖ్యము లొందఁజేయఁడో మహోతాత్పర్య చిత్తంబునన్
మనలోనన్ మనవారె యీర్ష్యలు వహింపన్ వారివే నేరముల్.

సీ. ఒకనిసొమ్మేమి వేఱొక్కనిసొమ్మేమి, చక్కెర కమరునే చిక్కఁదనము
లోకులు గననేమి తా కనుంగొననేమి, వెన్నెల పూనునే విన్నఁదనము
అంత గైకొననేమి యింత గైకొననేమి, యమృతాన కబ్బునే యల్పతనము
చెంత నుండిననేమి చేత నుండిననేమి, విరిబంతి కబ్బునే వెగటుఁదనము

గీ. ఒకతె చవిఁగొన్న లేదె మోవికిని ఓపి, నలుగురును జూడ లేదె నవ్వులకుఁ దెలివి
మాట యొకమాటువిన్నఁ జాల్ మనసు తృప్తి, శౌరికడనుండినను లేదెసంతసంబు. 147

మ. వినుఁ డేవేళను గష్టుఁ డేనగరికిన్ వేంచేసెఁ దా నెవ్వతెం
గని మాటాడెను వార లప్పటికిఁ బల్కన్ మేర సర్వజ్ఞుఁడౌ
ఘనుఁ డేలా పొరపొచ్చెముల్ నడపు నింకన్ మానుఁ డీవార్త లో
య్యన నారాధ యొకింత విన్న మనకే యౌఁ జిన్నపో హీనముల్.

చ. అన నిది యుక్తమంచు నపు డందఱు సమ్మతిఁజేసికొంచు మె
ల్లనె తమయిండ్ల కేఁగి యొకలాగున నుండిరి వారిమాటలే
యొనరికఁ బొంచులుండి విని యొద్దికఁ బెంపుడుచిల్క గ్రక్కునన్
దనకువచింప రాధ విని తా నది శౌరికిఁ దెల్పెఁ గల్పనన్. 149

క. ఈనుడువు లిపుడు వింటివె, యానడుమను నీవు చిలుక నంపిననాఁడే
నానావిధముల నడిగిరి, మానవతీ! నీదురాక మహి నల్పంబే. 150

వ. అనిన రాధికావధూతిలకం బతిముదంబునఁ గృష్ణునితో నిట్లనియె.

సీ. పల్లెతావులనున్న గొల్లదానిని దెచ్చి, నిధిరత్నములయందు నిలిపినావు
చెలఁగి రాధామాధవులచెల్మి హో యన, బిరుదైనకీర్తిఁ గల్పించినావు
ప్రౌఢలైన కిరీటపతులకన్యల మాని, ననుఁ బ్రాణపదముగా నడపినావు
సకలవిద్యారహస్యము లెఱుంగఁగఁజేసి, దేహ మానంద మొందించినావు

గీ. నేఁడు నాపాలిదైవంబు నీవె యనినఁ, జాల దీమాట నామహోత్సాహమునకు
నెంతసంతోషపడెదనో యెఱుక లేదె, మొదటికిటుచేయు సర్వజ్ఞమూర్తి వీవు 152

గీ. ఒకటఁ గొఱఁతయు లేక నే నున్నదాన, నైన నావిన్నపం బిపు డాదరింపు
నీదుపట్టపుదేవులు నేను నీవు, బంతిభుజియింపవలె రేపు సంతసమున. 153

చ. అని మఱునాఁడు వారికిఁ బ్రియంబుగ సమ్మతి గాఁగ శౌరిచే
తనె పిలిపించి వారలును దానును గృష్ణునిఁ గూడి బంతులై
యనువుగఁ బంచభక్ష్యపరమాన్నములన్ జవు లెంచికొంచు భో
జన మొనరించి ధాతకరసారసలై ముదమంది రందఱున్. 154

మ. నవరత్నస్థగితంపుసొమ్ములను నానాగంధపుష్పాదుల
న్నవరంగత్కనకాంబరంబులను గాంతల్వింతలై చేరి చు
ట్లవసింపం గొలువున్నమాధవునిదండ న్నిల్చి యారాధ మ
క్కువతోఁ బల్కెను గప్పురంపునునుబల్కుల్ దళ్కులం జిల్కఁగన్.

మ. పొలుపొ రుక్మిణిసత్యభామలకు నీపూఁబోండ్లకాయున్నక
న్నెలకు న్నేఁ జెలికత్తెనై తెలిపెదన్ వీరల్ భవత్ప్రీతికై
కలహం బందఁగ నేల? పంచి వరుసల్ గల్పించి గోపాల వీ
రలకున్ దిట్టము చేసి చేసెదనుమాధ్యస్థంబు నే నియ్యెడన్. 156

చ. ఒకనెల కొక్కమేర వినుఁ డున్నదినంబులలోఁ బదాఱువే
లకును బదాఱునాళ్ళు; లవల న్మతి యార్గురి కాఱునాళ్ళు నొ
క్కొకటిగ లక్షణాదులకు నొప్పగు; సత్యకు రెండునాళ్ళు; నం
దుకు నొక హెచ్చు రుక్మిణికిఁ దోఁచినచో దయ నిల్పవె త్రికిన్. 157

గీ. అనుచు నోయక్కలార నే నంటి ననుచుఁ, గోప ముంచకుఁ డీమేర కొదువగాదు
సమ్మతిలుఁ డంచుసతులమొగమ్ముఁ జూచి, హరికి మొదలుగ రాధ యందరకు మ్రొక్క

క. కూర్చుండు మనుచు రాధం, గూర్చి పడంతుకలు మెచ్చుకొనుచుం బ్రియముం
గూర్చిపలుకంగఁ గృష్ణుఁడుఁ, గూర్చుండఁగ నిడియె నవ్వుకొనుచుం జెంతన్. 159

ఉ. అంతట వారి వారిని గృహంబులకున్ సెలవిచ్చి రాధికా
కాంతను గృష్ణదేవుఁడు తగనే గరఁగించి చెలంగి వింతకున్
వింతలుగాఁ దమిన్ వరుసవెంబడి నందఱయిండ్ల కేఁగి యా
త్యంతవిలాసమార్గముల దక్షిణనాయకుఁ డయ్యె నున్నతిన్. 160

క. విను రాధామాధవకృతి, మనమున నిడి వినినఁ జదివి మఱి వ్రాసిన మె
చ్చిన యాధన్యాత్ములకున్, వనజాక్షుఁ డొసంగు సకలవైభవము దయన్. 161

గీ. అనుచు శుకయోగి తెలుప నజ్జనకవిభుఁడు
కృష్ణుఁడును రాధయును గాక యింకను గలరె
దైవము లటంచు వారల భావమునను
దలఁచి మ్రొక్కుచు శుకయోగిఁ గొలిచియుండె. 162

ఉ. కృష్ణయమంత్రివృత్తి! సుకవీంద్రముఖాంబుజకంజమిత్ర! శ్రీ
కృష్ణపదాబ్జసంతతవశీకృతచిత్త! నవీనచిత్తజా!
జిష్ణుసమానభోగ! గుణచిత్రవిశేష! గభీరసాగరా!
వైష్ణవసమ్మతప్రకటవస్తువిచారణ! మంత్రివారణా! 163

క. చతురతరవచనరచనా, చతురానన! కవినిధాన! సంతతదానా!
మితభాషణ! హితపోషణ!, మతితోషణగుణధురీణ! మాన్యవిహారణా! 164

మాలిని. మగదలకులధీరా! మానినీచిత్తచోరా!
యగణితగుణహారా! యర్థిరాధాకుమారా!
నిగమవిధివిహారా! నిత్యసౌఖ్యానుసారా!
సగరభవగభీరా! చారుశృంగారవీరా!

గద్య. ఇది శ్రీ మద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ శృంగార కవిత్వ వైభవ
వెలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకట
పతినామధేయ ప్రణీతం బైన రాధామాధవ సంవా
దంబను మహాప్రబంధంబునందుఁ సర్వంబును
తృతీయాశ్వాసము.

సంపూర్ణము.



# పోతులూరి వీర బ్రహ్మముగారి జీవితము



'భారతాధ్యాత్మిక ప్రభ భాగ్యమెుక్క భరతజాతికగాక యెవ్వరికి గలదు?'

అయ్యలారా! విశ్వప్రపంచైక విజ్ఞానఫలదాయిని, వేదకల్పక మున కాలవాలము, సంకల్పమాత్రమున జగన్నిర్మాణ మొనర్పదక్షులగు దపోధనుల కాస్పదము, సత్యగతాదిదిదృక్షాదీక్షితులై నహరిశ్చంద్రాదు లేలిన పవనభూమి, పరశురామ, ద్రోణ, పాండవేయాది వీరులంగన్న వీరమాత శంకరాది మతాచార్యులకు పుట్టినిల్లు. భువనైకపావని యని ఖ్యాతి నందిన భరతఖండంబున నెందరో మహాత్ములు పుట్టి గిట్టు చున్నారు. మీరు గాంధీమహాత్ముడు తిలక్ మొదలగువారి నెందఱనో చూచుచున్నారు. రామకృష్ణ పరమహంసాదులను విని యున్నారు. రామదాసాదుల జీవితముల నుజదివియున్నారు వారందరిని మితిమీఱిన భూతభవిష్య ద్వర్తమానవేది, అద్వైతసమూంబునిధి, పక్కా వేదాంతి గృహస్థాశ్రమములో వుండి పరతత్వమెఱింగిన బ్రహ్మవేత్త అతని కాల జ్ఞానవచనమునుజూచి వేదాంగవేత్తలు విభ్రాంతులైనారు. తత్వజ్ఞాన వైదుషి, గృహస్థాశ్రమమందుండియే నిత్యశుద్ధిగా నెఱపిన వైష్ణవ సంపత్తి, యోగీంద్రులు తలక్రిందు లగుట జూపిన మహత్త్వము, వేనోళ్ల పొగడని వేదాంతులే లేరు. అమ్మహనీయుని నిప్పటి నెఱింగిన వారు వేళ్ళమీద లెక్కపెట్టదగినట్లుగా నున్నారు. అతడే పోతులూరి వీరబ్రహ్మపరమయోగి ఆతత్త్వవేత్తజీవితచారిత్రము జనసామాన్యము నకు సుబోధకమగునటుల సులభశైలిలో యించుమించు 200 పుటలలో సమకూర్చి ప్రచురించినాము. దానింజదివినవాడే ధన్యుడు నేడే చదువ యత్నింపుడు. దానివలన నీహాంము ఫలితము మున్ముందు తెలియగలదు.

వెల రు 1-0-0